గీ. న్యాయమార్గంబు పలికెదు ♦ నన్ను నీవు
వెడల నడపింపు సంటివి ♦ వెడఁగు వగుచు
నిన్ను నీకత్తి సప్పుడే ♦ మన్నఁగొందుఁ
బ్రాఁణ మిది యేల మాఱంబు ♦ పాయనున్న.

(అని లేచి కత్తి దాటింప నుంకించుచున్నాఁడు)

బుస్సి—(గడగడవడంకుచు లక్ష్మన్నతో రహస్యముగా) హాహా! మహోపద్రవము వచ్చినది. నన్నీ యుపద్రవంబునుండి యెట్లు తప్పింతువో తప్పించి నా ప్రాణము రక్షింపుము. (సంభ్రమించుచున్నాఁడు)

లక్ష్మ—(ధర్మారావుం దరిసి ప్రార్థించును) ధర్మరాజా!

చ. త్వరపడకయ్య బూసిదొర ♦ వాసి యెఱింగిన వాఁడు మీఁపయిం
గరుణ దలిర్చునట్లు వెను ♦ కంబొనరించెద నిప్పు డాఁకటం
జిరచిరలాడుచుండె మన ♦ చెప్పినమాట చెవిం బడంగఁ బో
దరయఁగఁ గార్యముం జెఱచు ♦ నట్టివిధం బిది నీకుఁ జెల్లునే.

ధర్మరాయాగ్రణీ! నా చెప్పినమాట లన్యథాప్రవర్తింపఁ జేసి నీవిట్లాగ్రహంబునఁ గత్తినెత్తుట కార్యానుక్రమసంధానంబు కాదు. శాంతింపుము. శాంతింపుము. (చేయిపట్టుకొనుచున్నాఁడు)

బుస్సి—(పాఱిపోవుచున్నాఁడు)

(తెరలోఁ గలకలాసంతరము)

శా. నిన్నుం బట్టఁ దలంచినారరులు వి ♦ ర్ణిద్రప్రతాపప్రభా
వౌన్నత్యంబున నల్కోలంపుల బలం ♦ బాసన్నమై యుండె మా
కు నిన్ని చెంపకు రాగ నాఁక పడియెం ♦ గ్రూరాసివారంబులన్
గన్నాకైనకృపాణ మే జతగ రా ♦ నల్పొందు ధర్మప్రభూ.

ధర్మ—(ఆకర్ణించి తనలో) పరులు నన్నుఁ బట్టికొందు రని నా భటులు నాకుం దెలియఁ బలుకుచున్నారు. నే నిట నున్న నాకు

భంగంబు గలుగునని రేయే తోఁచుచున్నది. విజయరామరాజులు మహా నీచులు. నీచప్రకారంబులకుం బ్రయత్నించువారు (అటు నిటుం జూచి మహాలాఘవంబునం బఱవఁ దలంచుచున్నాఁడు)

(తెరలోఁగలకలానంతరము) గిర్తే మారో, మారో, పకడో, పకడో.

(అంత హైదరుజంగును, విజయరామరాజును, ఇరుకడ నిలువ విచ్చు కత్తులతోఁ బరవళ్ళు ద్రొక్కుచు వీరభటులు ప్రవేశించుచున్నారు)

ధర్మ—(చూచి తప్పించుకొని పాఱిపోవుటకుం బ్రయత్నించుచు నిటు నటుం బఱువు లెత్తుచున్నాఁడు)

హైద—కోన్ రే వస్తాద్? లాడుఖాఁ! ఐసాగిర్తేహైబద్మాష్ మారో మారో, పకడో పకడో,

విజ—ఓహో ప్రధానయోధులార! ఇతండు ముదిసినవాఁడయ్యును మిక్కిలి లాఘవము గలవాఁడు సుఁడీ!

చ. ముదుకఁడు ద్రోణుఁడెట్లు రణ ♦ భూతలశత్రులు ముట్టడించినన్
బెదరక లాఘవంబు మెయి ♦ బీరము తోరముగా మెలంగెనో
ముదిసిన నీతఁ డట్లు మన ♦ ముందర నున్నటు లుండు నంతలో
నదను గ్రహించి కన్మొఱఁగి ♦ యవ్వల దాఁటుఁ జుఁడీ రయంబునన్.

గీ. సింగ ముచ్చునఁ బడ్డట్లు ♦ రంగరావు
దూత మనచేతఁ బడె నిప్డు ♦ ఖ్యాతి మెఱయ
నెట్టులే వానిఁ బట్టుఁడీ ♦ ముట్టడించి
వానిఁ బట్టుట కోటను ♦ బట్టు టరయ.

హైద—తూరీగ లాగా యెగిరిపోతాడు వుంది. పీడికిపట్టువాలా మనకి కట్టం అవుతూ వుంది. కాని వస్తాద్ లాడూంఖాన్! దేఖో దేఖో పకడో పకడో,

భటులు—(పరుగులెత్తుచున్నారు)

ధర్మ—(ఇటు నటుం బఱచుచుఁ గత్తిఁ ద్రిప్పుచు నెగిరిపోవును.)

భటులు— (సంభ్రమముతో) అరే రే రే బద్మాష్ గయా హై మారో మారో (తుపాకులు ప్రేల్చుచున్నారు)

విజ—(నివ్వెఱపడి)

గీ. మెఱపుమెఱసిన చందాన ♦ మెఱసి మెఱసి
కంట మసిఁ బ్రామి మనలను ♦ గంటు పఱచి
దూత ముదుకండు గిరగిరించి ♦ దూఱె సకట
మన ప్రయత్నము విఫలమై ♦ మంటఁ గలిసె.

హైద—బడాఆద్మి బడావస్తాద్ వున్నాడు! మనకీ బోమ్మా గట్టి మనీవారినీ చావగొట్టీ పారీనాడ్. హెంత మోసం! మనంపర మోసం చేసీనామ్. చనంతప్పీపోతే బుస్సీతలా తెగీ పోన్. హెంత మోసం! హెంత మోసం!

విజ—ఖానువర్యా! కడచినదాని కింత చింతింపఁబని లేదు, మనకు బుస్సీదొర యాజ్ఞయైనది గావున మన మందఱము నిప్పుడే కోటముట్టడింతమురండి, మనవృత్తమెఱిఁగి బొబ్బిలివారును యుద్ధసన్నద్ధులై యుందు రనియే నానిశ్చయము.

(తెరలోఁ గలకలము)

హైద—అచ్ఛాభాయ్! మనాలమ్కర్మే డంకాబజాయింపూ అవుతూవుంచి, లెండు యుద్ధంకు తయ్యారు లెండు. పయానంకండు.

(అందరును లేచి నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము

# బొబ్బిలి యుద్ధము

## తృతీయాంకము

స్థలము : బొబ్బిలి సభాభవనము

[వెంగళరాయుఁడు, నరసరాయఁడు, చెలికాని వెంకయ్య, కాకర్ల పూడి వేంకటరాజు, కొందఱు సేవకులును గొలువఁ గొలువు దీరి రంగారాయఁడు ప్రవేశించుచున్నాఁడు]

రంగా — మంత్రివర్యులారా! మచిలీపట్టణంబున కరిగిన మంతెన బుచ్చన యింత మసలుట కేమి కారణమో? గోలుందొర గౌరవించెనో లేదో?

నర — రాజాగ్రణీ! గోలుందొరకు మనపై గౌరవంబు మెండు కావున మనబుచ్చన నాదరించి బుస్సీకిం దెలియఁ బుచ్చుననియే నా నమ్మకము,

శా. ఆగోలుందొర, బుస్సియొక్క తెగవా, రాంతర్యమం దిర్వురున్
రాగం బందిన వార లొక్కరుని ప్రా ♦ రంభంబు వేరొక్కఁడో
బాగంచున్ వచియించుఁగాదన డెదం ♦ బాటింప నస్మత్కృతుల్
యోగింపన్ బుసి కాతఁ డేమయిన వ్రా ♦ యుంబో యనంబోలు నే.

చ. వెం — కం. వ్రాసినను వ్రాయు గోర్దొర
బూసి యొకింతయును దాని ♦ మున్నిడుకొనుచుఁ
వాసిఁ గనఁడు బుచ్చన కా
యాసమె కా కింతయైన ♦ నట ఫల మున్నే?

కా. వేం—

మ. అనయన్ రాజు నిశాచరుండు గెలుచు ♦ న్యాయాపార పారీణుఁడున్
వరసచ్ఛ్రకహాసుండు వాఁ డెపుడునుర్ ♦ వర్తించుఘోరామయో
త్కరమందున్ మచిలీపురంబుఁ జనితం ♦ త్రంబుల్ బూసుగిందిగో
ద్ధారచిత్తంబుమరల్పనోపుబుసిపొల ♦ దుంబొంది తానుండుటల్.

రంగా—

మ. అకటా! మీరలిటూరఁ జెల్లునెద యా ♦ స్వాంతుండునోర్, రెడ్డినా
యకుఁ డత్యుత్తముఁ డాతనిం గెలుచు నెట్టి ♦ య్యుద్ధమున్ రావువా
రికిఁ బతంబు వహించియుండు రెవ రే ♦ రీతిం బ్రబోధించినన్
సుకృతం బొక్కసుమంతయుండిన ఫలిం ♦ చుంగార్యమప్పట్టునన్.

కాని! మిత్రులారా! బుచ్చన్న నేఁడు వచ్చునని తెలియవచ్చినది కదా! రాలేండు. సర్వము విశదమయగు; ధర్మరావుచుంబోయి కొన్ని నాళ్ళయ్యె. నతనిజాడ యును దెలియరాదయ్యె. సరే, సేవకా! పురోప కంఠంబున కెదురేగి బుచ్చన్నరాక విచారించి రమ్ము పొమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

బుచ్చ—(ప్రవేశించుచుఁ దనలో)

మ. చతురుం డీతఁడటంచు నన్నుఁబనిచెన్ ♦ సంధింబొనర్పంగ నా
గతి యంతన్ వితయయ్యె నే నిపు డిటం ♦ గాన్పింప నేమయ్యెనో
హితుఁడా! కార్యమటన్న మన్నదొరతో ♦ నేమంచువాక్రుచ్చెదన్
హితమున్ జేసికొనంగ నోర్వలేని మనుజుం ♦ డేలా? యొడల్ కాల్పనే.

హాహా! కాలము చెడ్డదయినప్పు డెంతవాఁడు నేమియుం జేయఁ జాలఁడు గదా! కానీ, కానున్నది కాకమానదు. (సమీపించి) జయము జయము మహారాజా!

రంగా—(పరికించి) ఓహో! ఆశబోయిన సిద్ధ మెసరైనట్లు మాబుచ్చనయే వచ్చియున్నాఁడు. మిత్రమా! రమ్ము పీఠ మలంకరింపుము.

బుచ్చ—(ప్రవేశించుచున్నాడు.)

రంగా—మిత్రమా! గోలుండొర సుఖమైయుండెనా? విశేషమేమి?

బుచ్చ—తే. గోలుదొర సౌఖ్యమున । నుండెఁ గువలయేశ!

నేను మీరాయబారిని ♦ నా నతండు

కౌతుకము నం జేర రమ్మని ♦ కౌశల మడిగి

గారవమున మిమ్ము మెచ్చి నన్ ♦ గౌరవించె.

రంగా—వింటిరా! మిత్రులారా! గోలుండొర వృత్తాంతము ?

బుచ్చ—నేను రెడ్డినాయకునిముఖంబున మన వృత్తాంత మంతయు వినిపించితిని. విని విజయరామరాజు పరమదుర్మార్గుఁ డని యతఁడు నొక్కివక్కాణించెను.

రంగా—గోలుండొర యెప్పటికి మనపక్షమువాఁడే. తరువాత ?

బుచ్చ—వారు మహోత్తమోత్తములు. వారిపైఁ గలహింప వలదని మానవృత్తాంతమును దేట తెల్లముగాఁ దెలియునట్లొక జాబువ్రాసి మర్తైన కిచ్చి బుస్సీకడకుం బుచ్చె.

రంగా—సరే! మనకింక దిగ్విజయమే. తరువాత ?

బుచ్చ—జాబుం జూచి బుస్సీ హైదరుపై మండిపడినాఁడు.

వెంగ—మండిపడిన వాఁడు మండిపోయెనా ? మఱి విజయరామ రాజో ?

బుచ్చ—వానికివిం బ్రాయశ్చిత్తమైనది.

నర—ఆ. కడుపులోని చల్ల ♦ గదల కుండఁగ నీడ

పట్టునను సుఖంబు ♦ వడయుచున్న

మనకు లేనిపోని ♦ వనటఁ దెచ్చిన వాని

కెట్టియాపదలును ♦ బట్టఁదగును.

రంగా—మిత్రమా ! తరువాత ?

బుచ్చ—మూసాబూసి రోసంబునం జేసి వారిం దూరి పోరు మూన సంకల్పించినాఁడు.

రంగా— (సంతోషముతో) తరువాత?

బుచ్చ— వారు మిక్కిలి జడిసి యుక్కిసంబునం గొంతరొక్కము వానికిచ్చి లేనిపోని నేరము లెన్నో కల్పించి చెప్పి మనపై మరల నీ సెక్కించినారు

రంగా— ఛీ! ఛీ! బూసి గడ్డి గఱచి యంతలోనే పరాఙ్ముఖుఁడై మనపైఁబడ నెంచినాఁడా? కాని! విచారించెదం గాక, మిత్రులారా! వేల యని నన్నుఁదూలనాడెదరేమో? రాజులకుఁ జతుర్విధోపాయంబులు ననుప్రయుక్తంబులు సుఁడీ!

నర— అన్నింటికన్న రాజకీయధర్మంబు లన్నియు నెఱింగి మహారాజవైన నిన్నుఁ గాదనువాఁ డెవఁడు? నీచేఁత సంస్తవనీయుంబకాని సామాన్యమా? చవిటినేలవిత్తనం బంటకున్నఁ బొలముకాపు నింద్యుఁడా? అవి యట్టులుండుఁగాక, ద్వితీయంబున నైన ధర్మరావెట్లు కార్యంబు సాధించుకొని వచ్చునో?

వెంక— ఆఁ! ఇతఁడు చేసినాఁడు, అతఁడు చేయనున్నాఁడు! కానీ, యీ చెవులతోడనే వినకపోదుమా!

[అంతఁ దత్తఱపాటుతో ద్వారికుడు ప్రవేశించుచున్నాడు]

ద్వా— అయ్యలారా! నెత్తురుగుడ్డలతో మనధర్మారావుతత్తఱపడి వచ్చుచున్నాఁడది యే ముపద్రవమో?

అందఱు— (సంభ్రమ మభినయించుచున్నారు)

[అంత రక్తసిక్తాంగుఁడును సాయుధహస్తుండు నగు ధర్మారావు ప్రవేశించుచున్నాడు]

రంగా— (చూచి భయసంభ్రమములతో) మామా! యేమి యీ యుపద్రవము?

వెంక— మఱేమియుం గాదు కఱకుతురకల నఱకులచుఱుకు.

ధర్మా— నాసంధి వారి కనుసంధింపక నన్ను బంధింప నెంచిన వారి ద్రుమందించి వచ్చితిని.

రంగ——ఏమివృత్తాంతము? అశ్లేల జరిగినది? ఇంచుక విశ్రమించి సాకల్యముగా నెఱింగింపుము.

ధర్మా——నేను బోయి ద్విభాషిలక్ష్మణనాసితో సంభాషించి తనస్వాలమున నేలాకి యగు బుస్సి దర్శనముచేసి కార్యమును దెస వాఁడనై చెప్పవలసినంత వట్టు చెప్పితిని. దానికి వాఁ డంగీకరింపక తన మాటకు మాఱాడిన నన్ను వెతల నడిపింతు నని పలికినాఁడు.

రంగా——దానికి నీ వూరకుంటివా?

వెంగ——పాపమూరకుండ కేమి చేయును; మూఁడుకాళ్ళముదుసలి?

ధర్మా——(వెంగళరాయనిం జూచి తలపంకించి) రాజా! ఊరకుండు దునా? మహోగ్రహంబునం గత్తి నెత్తి తల నెగుర వేయ నుంకించితిని. కాని యంతలో దుబాసి నాచేయిపట్టుకొని సాయబును సంధించినాఁడు. ఆ సందున వాఁ డెందో పాఱిపోయినాఁడు.

వెంగ——(అనిష్టమునఁ జేయి విదలుపుచు) ఛీ ఛీ ఛీ ఛీ!

క. ఏమిపని చేసినచ్చితి, వామెయి సమయంబు దొరకె ♦ నా నేఁ గాసి
నామేనబావ గాసీ, యేమైనన్ వానిఁ ద్రుంప ♦ మే? భీతాత్మా!

ఆ. ముసలివగ్గ! నీవు ♦ పోనేల తగుదు న
న్నా యటంచు నటకు ♦ నట్టిసమయ
మబ్బ వాని నేయ ♦ వైతివి నీకత్తి
యేల? శౌర్య మేల? ♦ యేల బ్రతుకు?

వాని నొక్కరిం దెగటార్చినచో మన కే యిక్కట్టును లేక పోవునుగదా? ఎంతపని చేసితివి? ఎంతపనిచేసితివి? దుబాసి స్వామం బను సంధించినాఁ డని చెప్పుచుంటివి. వాఁడు మాత్రము మంచి వాఁడా? మన వలన లంచంబు దిని వానివలన నుపకరింపఁ జేయు చున్న పరమ దుర్మార్గుఁడు. వానిం గూడ నీ కరవాలంబునకు ద్వితీయకబళంబు సేయరాదా?

ధర్మా——(క్రోధముతో లేచి) ఓరి మూఢాత్మా?

క. ఏలా పశౌర్యము కరం, వాలమ్మిది యేల ముసలి♦ వగ్గా యనుచున్
వేళాకోళము చేసితి, వేలో కపిపింతు రమ్మి♦ దే పస యన్నన్

(అని పరవళ్ళఁ ద్రొక్కుచుఁ గత్తిఁ ద్రిప్పుచున్నాఁడు)

నర—అన్నా! శాంతింపుము శాంతింపుము (చేయి పట్టుకొనుచు.)

రంగా—(మోర బిగించి పండ్లు పట పటం గొఱుకుచు వెంగళ రాయని దిక్కు మొగంబై)

చం. మదమునఁ గన్ను గానకిటు♦ మాన్యులతో నెకసక్కె మాడుచున్
ముదుసలియంటివీ మాడునుదే♦ మొచ్చిన వాల్గల రుద్రుఁడో యనన్
గదనము సేయ వాలుగొని ♦ గ్రాలెదు దామెర ధర్మరాజు నీ
మద మది యేవ చూత మొక ♦ మాటెదిరింపుము వీఁకసీతనిన్.

ఆ. వె. కండకావరమ్ము ♦ కాఱులు ప్రేలుచు
మంచిచెడ్డ లెల్ల ♦ నెంచ నీవు
పసుచువాఁడ ననుచుఁ బడీ♦ కొట్టుకొందువు
ముసలి ముసలి గాడు ♦ ముసలిగాని.

వెంగ—(లేచి నుంకించుచున్నాఁడు)

బుచ్చ—(చేయి పట్టుకొని కూరుచుండఁ బెట్టుచున్నాఁడు)

రంగా.—గీ. బుద్ధిగలవాఁడ వేని నా ♦ సుద్ది విశ్వ
సించువాఁడవ యేని లో ♦ నెంచి శుభము
ధర్మరాయని కాళ్ళల ♦ దండ మొఱఁగి
సైపు మంచును బ్రార్థింప ♦ నోపు నీవు

నర—ధర్మరాయా!

ఆ వె. అన్న చేతిక్రింద ♦ నన్ని విధంబులఁ
బెఱుగుచున్న యట్టి ♦ పిన్నవాని
మాట కింతకోప ♦ మా నీకుఁ దగునయ్య
కన్నకొడుకు మీఁదఁ ♦ గత్తిఁ గట్ట.

(కూరుచుండఁ బెట్టి) వెంగళరాయ! ఈతం డపుడు బుస్సి నేయుట సుకరంబ కాని దూతకృత్యంబు వహించి యుండుటం జేసి కార్యంబున

కెక్కడ భంగంబు వచ్చునో యని సంశయించె నిది యుక్తంబు. నీకు దాయ చాకుండెఁ గాయని కోపంబు కాని వేఱొండును లేదు.

వెంగ—(లేచి ధర్మారావు చెంగటికిం జని చేతులు జోడించి)

చ. ఎఱుఁగక తప్పు చేసితి న ♦ హీనపరాక్రమ! దాయ నేయఁగా
దొరకక పోయెఁగా యనుచుఁ ♦ దోరపుఁగిన్క మదింగలంప నొం
డెరయఁగ లేక దేవగుణ ♦ వంత మహాత్ముఁగిఁ దూఱ నాడితిన్
దురితము గట్టికొంటిని న ♦ నుం గొనకుం డని సైఁచి కావవే

(కాళ్ళమీఁదఁ బడుచున్నాఁడు)

ధర్మా—(లేవనెత్తి) వత్సా! వగవకుము. మన కెంత శౌర్యమున్నను నంత శాంతం బూనుటయే విభూషణంబు బుస్సీ చేసినంతం బోవునా? పైన సాల్బడ్జంగు లేఁడా? యతండసమర్థుఁడా? మముఁబోంట్లు నీ చెప్పి నట్లు వేగిరించి రాజకార్యవిఘాతంబు సేయ వచ్చునా? పడుచుతనం బెల్లడం బనికి వచ్చునా?

రంగా—

శా. మామా! మాటలురాని బాలుఁడు మహా♦మాత్సర్యగర్వామయో
ద్దామస్వాంతుఁ డితండు యౌవనమదో ♦ ద్గారంబునం గానలే
కే మై మాన్యుల ధిక్కరింప విన న♦ య్యోం దప్పు సైరించి నన్
నీమేనల్లుని నిర్మలాత్మ గలుగన్ ♦ వీక్షింపుమీ మ్రొక్కెదన్.

ధర్మా—రాజా! దీనికింత యేమిటికి? మన వేంగళరాయఁడు నాకుఁ బుత్ర ప్రతిముఁడు గాని శత్రుండా? ఆక్షణ మట్టిది. అది యట్లుండ నిమ్ము. తఱువాత జరిగిన చిత్రకథ వినుము.

రంగా—మామా! నాచిత్తం బిప్పటికి స్థిమితపడినది. తఱువాత సంగతియేమి?

ధర్మా—నేను మఱలి రాఁదలంచునంతలో హైదరుజంగును విజయరామరాజును కొంతతురుష్కబలంబుతో వచ్చి నన్ను ముట్టడించి పట్టుకొనం దలంచినారు.

రంగా—హాహా! ఎంతపని చేసెరాయ దుర్మార్గుఁడు!

వెంగ—

శా. హాహా! హైహయరాజశీర్షము కళిం ♦ గాధీశుశీర్షంబులన్
బాహాశక్తి నిశాతహేతివిలస ♦ ద్వైశ్వానరజ్వాలలన్
స్వాహాకారముగా గళోద్గళదసృ ♦ గ్బహ్వాజ్యధారాప్లుతిన్
సాహంకారత వేల్వనైతిగద మా, మా! రాజసూయంబుగన్.

రంగా—ఆ విజయరామరాజు ♦ విషబీజవృక్షమై
రావువారి కెంతొ ♦ రావు దెచ్చి
పెట్టె! గోడిగాఁగ ♦ నిట్టు లుండి రటంచు
గనఁగ గనఁగ వాని ♦ కన్ను గుట్టె

ఆపాపాత్ము నేమి చేసిన జేయఁదగినదే, తరువాత?

ధర్మా—అంతలో నే నాముట్టడించిన మూకలం జించి చెండాడి పట్టుపడక యిట్లు విన్నవింప వచ్చితిని మహారాజా?

వెంగ—(సంభ్రమముతో) మామా! రామరాజుం గూడ జంపి వచ్చితివా?

ధర్మా—(దైన్యముఖముతో) లేదోయి నాయనా! లేదోయి!

రంగా—మామా! నీవు మూకలఁ జించుకొనివచ్చునప్పుడు మొఱకు తురక యూరకుండెనా?

ధర్మా—వాఁ డూరకుండునా? ఊరకుండిన విజయరాముఁ డూరకుండ నిచ్చునా? నన్నుఁ బట్టుకొను ప్రయత్నము విఫలంబయినప్పుడు కోటముట్టడించి పట్టుకొనుఁడని మూకల కాజ్ఞ యిచ్చె

రంగా—మూసాబూసి నీతో మఱియేమియుం బ్రసంగింపలేదా?

ధర్మా—ప్రసంగింప కేమి? కావలసినంత ప్రసంగించినాడు. ప్రసంగించినదంతయు మనకుఁ బ్రతికూలమే. "బిరుదునిషానీలు విడిచి మీరాజు సపుత్రమిత్రకళత్రంబుగాఁ గోటవిడిచి పోవుటయో, లేదేని

విజయరాముని కాళ్ళుపట్టుకొని సంధి చేసికొనుటయో శ్రేయంబు కాదేని యుద్ధంబుసిద్ధంబు, అందు విజయంబుమాకుసిద్ధాంతము'' అని చెప్పమనెను.

రంగా—అన్నా! దుర్మార్గుఁ డెంతమాట చెప్పినాఁడు! ఆలుబిడ్డలతోఁ గోట విడిచిపొమ్మనుటయే గాక విజయరాముని కాళ్ళమీఁదఁ గూడఁ బడు మనియెఁగా! హాహా! కాలమహిమ! (క్రోధముతో)

శా. యుద్ధంబుం బొనరించి బొబ్బిలిగడీ ♦ నుట్టూంత లూగించినన్
వృద్ధస్త్రీశిశుపుత్రమిత్రధనభా ♦ న్యేష్టార్థముల్ వోయినన్
బద్ధుం డైన నశించిపోయినను భా ♦ స్వద్రాజ్యవంశోద్భవుం
డిద్ధస్పర్ధఁ దెగించుఁ గాని యితరా ♦ పేక్షం బ్రవర్తించునే

ఆ. వె. గర్భశత్రు వైన ♦ నిర్భాగ్యు పాదముల్
పట్టుకున్నవానిఁ ♦ బరమనీచుఁ
బెలుచఁ బట్టి నాల్క ♦ వేయి చీలికలుగాఁ
గోయ వలదె సాన ♦ రాయుకత్తి.

అమాత్యవర్యా! మన కిఁకఁ గర్తవ్యమేమి?

నర—యుద్ధమే కర్తవ్యము

చెవెం—(భయ మభినయించుచు) మహారాజా!

మ. నిశితక్రూరగదాసితోమర శత ♦ ఘ్నివ్రాతసంభూతమై
దశదిగ్వ్యాప్తమహారిసైన్యమెదురన్ ♦ దథ్యం బసాధ్యం బగున్
నశియించుం బ్రజ గోళ్ళఁ బోవుపనికిన్ ♦ గానాను గొడ్డళ్ళు దు
ర్దశ పాలౌదుము కొన్నినాళ్ళు తలపాం ♦ దగ దాచుకోరాదొకో

గీ. రాజపాదముఁ బట్టగ ♦ రాదుగాని
బొబ్బిలిని వీడి యెందేని ♦ బొంది పోనఁగఁ
గాలమును ద్రోయఁగా రాదె ♦ కాశ్యపీంద్ర!
తొల్లి దేవేంద్రుఁ డొక తమ్మి ♦ తూటనుండె

రంగా — వెంకయ్యా! ఎంత వెఱ్ఱివాఁడవు?

శా. నీచత్వంబున సత్కులీనుఁడు కడున్ ♦ జీవించుకంటెన్ నిజ
ప్రాచుర్యప్రతిభా విశేషమున వి ♦ శ్వాసంబెన్న సద్గుణం
బే చాలున్ యశముం గడించుకొనిసన్ ♦ వీర ప్రతిష్ఠాన్విత
రేచర్లాన్వయజాతు లట్టిబ్రతుక ♦ ర్థి న్మెత్తురే? చత్తురే?

గీ. ఎప్పటికి లేనిబ్రతుకనసు ♦ దిచ్చఁ జేసి
శాశ్వతం బచ్చుగాఁగుకీర్తిఁ ♦ జంపు కొనఁగఁ
గౌశలమె? పురుషున కిల ♦ గాజుపూస
బెడఁగుఁ గని మాణికము నోయి ♦ వెడఁగు గలఁడె?

మఱియును వారు మహాకాలవంతు లత్యర్థము లంతె వేసి వినుము.

శా. నా సామే సన సొప్పుతాంబ్రమల ర ♦ త్నం శాత్మ నానొప్పునా
నాసైనోడును విక్రమైకధను లె ♦ న్నక వీరు జన్యంబునన్
గాసంతైన వెఱుంగు సూననినుదిన్ ♦ గాలాదినక్ లాసులక్
మాసాబూసిపరాసుసైన్యములను ♦ స్మూలింపరే బ్రేల్మిచిన?

ఉ. ఆయినుగంటి భూరితమ ♦ మంత యడంచి ప్రభన్వెలుంగుచో
సీయినుగంటి వైరితమ ♦ మింత యడంచి ప్రభన్వెలుంగుచో
నాయినుఁ డీయినుం డనగ ♦ నౌ వర తేజమున స్వభావసు
త్వాయతిలోక బంధువగు ♦ నాయినుగంటినృసింహుఁ డల్పుఁడే?

ఉ. దీనున మెప్పు శాత్రవుల ♦ దీ టడఁగింపఁగ ధర్మరాజె యీ
దామెరధర్మరాజు బల ♦ దర్పమదింబది యంతయున్ జనం
బీమెయి నేడు చూచెను గ ♦ దే! జగదీడితవీరుఁ డీత డా
రాముని గీమునిం దురక ♦ రాజుల గీజుల లక్ష్యపెట్టునే?

గీ. చెలికానినరస భూవర
తిలకంబు నుతింపఁదరమె ♦ దేవళ్ళఁ గుసే
గలనమున నితఁడు కత్తిన్
జళిపించినఁ బగర పొగరు ♦ సళ్ళం బడదే?

క. బుచ్చనయు స్వేంకటరా
జచ్చం బగుభక్తితోడ ♦ నస్మజ్జన మై
చిచ్చులుకై నైన వెఱవరు
చిచ్చఱపిడుగులు గదయ్య ♦ చివ్వాలయందున్ ?

క. నీబీర మిూ వెఱుంగవు
కాంభోలును శత్రుసేన ♦ కనుంబను చున్నన్
నీ బారుటీలు గని [illegible]
[illegible] ♦ [illegible] స్తంభ మగున్.

గీ. ఉక్కు తునకలు గద మన యోధు లెల్ల
గలకు తురక ఫిలంగుల ♦ సరకుఁగొనరు
చిత్తజల్లుగ నాటిలో ♦ నెత్తిఁ బడు తు
పాకిగుండ్లకు జంకరు ♦ వీఁక విడరు.

వెంకయ్యా! మనవారి పరాక్రమంబు లిట్టివి. మానంబుపోయిన వెనుక మానధనులకుఁ బ్రాణంబుప్రయోజనంబు కాదుగావున నీమాట యుక్తియుక్తంబు కాదని యెఱుంగుదువు గాక,

అందఱు — మేలు మేలు! మహారాజ మేలు మేలు!

కంచుకి—(ప్రవేశించి) హాసాదు మహారాజ! ఎవఁడో, యొక హుమ్మాపుహుమాయి నెక్కి వచ్చిహజారము వాకిట వేచియున్నాఁడు. అతండీపత్రిక దేవరవారి కిమ్మని నా కిచ్చినాఁడు. (పత్రికనిచ్చును)

నర—(పుచ్చుకొని చదివి) మహారాజ! హైదరుజంగు వద్దనుండి హాసనల్లీఖానుఁడు వచ్చియున్నాఁడు.

రంగా—(ఉత్సాహముతో) వారిలో నతండు పరమోత్తముఁడు. అతం డిపుడు వార్తాహరుండై మన కేదియో మేలువార్త దెచ్చియున్నాఁడు. మీరెల్లరు వాని కెదుర్కోలు సేసి తీసికొనిరండు.

అందఱు—చిత్తము (అని నిష్క్రమించుచున్నారు.)

[ అంత నగరరాజోద్యోగులతో హాసనల్లీఖాన్ ప్రవేశించుచున్నాఁడు. ]

హాస—సలాం బందగా నేయూలీ!

రంగా—ఓహో! నాప్రియమిత్రుఁడు హాసనల్లీఖానుఁడా? రమ్ము. (పీఠముం జూపుచున్నాడు అందఱు కూరుచుందురు)

రంగా—ఓహో! ప్రాణమిత్రమా! నీరాక మాకు రాకయుం బోకై వ్రేఁకం గూర్చుచున్నయది. ఏ కారణంబున నిట వచ్చితివో విన ముచ్చట పడుచున్నవారము.

హాస—మహారాజ్! నేను మీకీ యెదిరీవస్తాన్. నారాకా మీకీ కోపం సేస్తాది. ఖుష్ సేయదూ వుందీ. నిజం, హామారా వజీర్ సాహేబ్ బద్మాషువున్నాఁడు. మీకీ మార్నేకు తయ్యారువున్నాడు. విజయ రాజకీ ఖిలాఖత్ అయి లష్కర్కీ సిద్ధంచేసీ నాగోపి లగాయత్ ముశీపిల్లో గిల్సి బుస్సీ కహూచ్చేరి సేయుసమయంలో మీ బురుజాల్మీద నౌబత్ బజాయింపూ యని కొండెం సెప్పీనాడ్. ఆను నాకూ పిలిసి "రావుల్ ఢంకా నగారా బిరుదూ నిషానీల్తో గడీ విడిచిపోలేద్! పోకాపోతే లడాయికీ లడాయించీ వున్నాం' సెప్పూమన్నాడ్ దానికీ వొచ్చీనామ్ మహారాజ్!

రంగా—మిత్రమా! హైదరుజంగు మాపై నింత యాగ్రహించుట కేమి కారణము! విజయరాముఁడిచ్చిన లంచంబున కంత కంతగా మావలన మాత్రము తీసికోరాదా?

శా. మూసాబూసి యిదింత సేయెఱుఁగ కా ♦ మూఢాత్మమాయాగతిన్
మోసం బంది యథాప్రవర్తనమునన్ ♦ బో లేక తాఁ దైలపి
ష్టాసక్తిన్ వెనువెంట నంటుభవకం ♦ బట్లాపశుఘ్నోక్తిపై
నాసం జేసి మెలంగుచుండుఁ గలుష ♦ వ్యాపారపారీణుఁడై.

మ. కలకాలంబుగ మా కనుగ్రహితముగా ♦ గన్పట్టు భేర్యాదులుం
దోలఁగం గోటను పీడిపొమ్మనుటయున్ ♦ దుర్మార్గుఁడా రాజు కా
ఖులు సేవించి మెలంగు మంటయునునా ♦ లోచింప నా బూసికిన్
ఖలుఁ డా హైదరుజంగుసాహెబునకున్ ♦ గారాదు నా నొప్పదే.

మిత్రమా! మేమీయవలసినదె కాక మఱియెంతపైకమిచ్చుకొమ్మనిన నిచ్చుకొందుము. మఱి యేమి చేయుమనినం జేయుదుము కాని యీ రెండును మాత్రము చేయువారము కాము. మాకు బలవద్విరోధంబు వచ్చి ప్రాణములు గోలు పోవలసి వచ్చునని భయంబిసుమంతయు లేదు. మావలన నేర మింతయును లేదు. దుష్టరాజ ప్రబోధనంబున మాపై నెత్తివచ్చిన రాజమ్ము; దైవమేదానికిం బ్రమాణము.

హుస—రాజా! మీరు బహుసుంచివారు. మీకీ ఎప్పా లేద్, మీ బిరుదూ నీపానిల్ తీసి వెయ్యాలా వార్కీ-ముంఖు కాద్. ఖూసఖూంచం హోలోసనా సెయ్యావాలావుందీ. వారు భలవంతుల్ బడాలమ్కన్ కలావార్ వారికళహం మనకీమంచీ కాద్. మీ సుచీవార్కీ జమారు లేద్. హైదరు రాజా మాటామీదా వున్నాడ్. వాడికి వాడూ కత్తి గొట్టి శాసాసేకాడ్. వాండికీమాటా సెల్తాది. నీకీమాట సెల్లదూ వుంది. మనవీ నేస్తాక్ మేరాదాదా! వాక్క-నెలాబైటాపో. మల్లీనీకీ రాజ్యం తెప్పిస్తాన్ షంశయం లేద్. నామాట యిను ఖత్తీముట్టిసెస్తాన్. పిల్లల్కీ కాపాడ్కో వాలారాజా! నామాటయిుక్. నీకీపార్థనా సేస్తాక్. నీకీ దండం పెడతాక్. సిన్నూ సూస్తే సాలాబెంగా యేస్తాదీ వున్నదీ. నీకీ మేలు సేస్తాన్. నామాట యిన్. నామాట యిన్.

రంగా—ప్రాణమిత్రమా! నీకు మాపై మిక్కిలి దయగల దని నే నెఱుంగుదును. దానం జేసియే నీవింతయుం జెప్పుచుంటివి. నీమాట వినకున్న మాకుం బ్రాణగొడ్డంబు వచ్చుటయే సిద్ధము. అయినను,

పంచ. పరంపరాగతాన్వవాయ ♦ పౌరుషాభిమానముల్
పరాపరాత్మగౌరవంబు ♦ ప్రాభవప్రశస్తియుక్
జరామయాదులన్ నశించి ♦ సగ్గిపోవ నున్నయీ
శరీరమందు నాసం జేసి ♦ చంపుకోంగ నాయమే.

ఏది యెట్లయినం గానిమ్ము దాని కింతయునుం జింతింపఁ వలసినపని లేదు. నీకు మాపైఁ బరిపూర్ణానుగ్రహమే యున్నయెడల వారడిగి నంత సొమ్మిచ్చి వారిదర్శనమునకు వచ్చి యనురక్తిం బ్రవర్తించెద. ఇట్లు చెప్పి సంధి గావింపుము కాదేని కానున్నది కాక మానదు. దీని కొండాడకుము నావలనఁ ద ప్పున్నం జెప్పుము.

హాస—(విచారమునఁ దలపంకించుచు) రాజా! సెప్పవాలా సెప్పినాఁ. పైనా నీ సిత్తము. సేసూ సెయ్యాగ్నేదీ సేస్తాఁ. మీాదా దైభం వున్నాడ్. నాకూ సెలవు.

రంగా—నీమాట వినక నీరాకరించితి నని నాపై నాగ్రహింప కుము. మమ్ము మాత్రము మఱచిపోకుము! పోయి రమ్ము.

హాస—చిత్తం చిత్తం. (లేచి సలాములుచెసి నిష్క్రమించు చున్నాడు)

అందఱు—(లేచి కొంచెము మనుపరంచుచున్నారు)

చారుఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజా! శత్రు సైన్యం బంతయు యుద్ధమునకు సన్నద్ధమై యున్నది.

చారు—మహారాజా! రథహస్తిపదాతితురంగాములతో వేన వేలు మహాసైన్యంబు భూమి యీనినట్లెల్లెడం దానయైయుండెను. అందుఁ దురుష్క సైన్యంబునకు లాడూఖానుని, పరాసుసైన్యంబునకు లాసుని, కళింగసైన్యంబునకు విజయరాముని, అధికారులం గావించిరి. వారెల్లరును శిరస్త్రాణకవచాదులం దొడిగి ముసల ముద్గర కరవాల భిండివాలాదులను బిఱంగులుం దుపాకులును లోనగు నానా విధాయుధంబుల ధరించి యుద్ధపాండిత్యంబు మెఱయ మోహరించిరి. అమ్మోహరంబున నగ్రభాగంబున లాడుఖానుండును, నిఱిందిదెస మహమ్మదుస్సేన్ మయూరాకులును, దక్షిణంబున జాసూఖాన్ సిద్దీ బిలాలును, ఉత్తరమున హసనల్లీఖాఁ షుకురల్లాఖానులును, పశ్చాద్భాగంబున ఛత్రపతి ప్రముఖ రాజపుత్రసమేత పారసీక

యవన బర్బర పుళింద పుల్కసాదులును మధ్యదేశంబున సమస్త కళింగ సైన్యముతో విజయరామరాజును నిలుప నియమించి హైదరు జంగు మహాహంకారంబునఁ బెద్ద కోలాహలంబు సేయును నేల గ్రక్కదల నెల్లసేనల నడపించుకొని మన బొబ్బిలిగడీ ముట్టడింప వచ్చుచున్నాఁడు మహారాజా!

రంగా—(అలక్ష్యం బభినయించుచు) హా! హా! మనకోట ముట్టడింప నంత ప్రళయముగా వచ్చుచున్నాఁడా?

శా. రానీ వేలకు వేలు గానుబలెకా ♦ గాసూప రాసీల నేఁ
గానీ తమ్ముఁడు గాని కన్ దెలియుమా ♦ గాఁ బేరు లేనట్లు గ
న్గో నీలోకము, కాల రాసి జయుపం ♦ గూడంగ సాధింపమే
మానంబున్న మనుష్యుఁ డిట్టిటులె రా ♦ యున్నించునే ప్రాణమున్.

[అంతఁ దత్తరపాటుతో నొక భటుండు ప్రవేశించు చున్నాఁడు]

భటు—హా సాదు మహారాజ! పరాసు సైన్యము వచ్చి మన కోటపైఁ బడుచున్నది చేనిపుడు హనుమంతు బురుజుమీఁదనుండఁగా సముద్రపు హోరువలెఁ బెద్దచప్పుడు వినిపింపఁగా నిది యేమిరా యని లేచి యట్టిత్తి చూచితిని. బాబూ! భూమి యీనిన ట్లెక్కడఁ జూచిన నదియె కనిపించుచున్నది.

రంగా—సరే! నీవుపోయి నీపనిలో నుండుము. ఓహో ప్రధాన యోధులారా! మంత్రివర్యులారా! మన కింత మహాయుద్ధంబు సిద్ధంబయినది కదా!

మ. చిరకాలంబుననుండి మీరలు మమున్ ♦ సేవించి జీవించు చుం
టిరి, మీ తాతలు తండ్రు లిట్లె మిగుల ♦ విశ్వాసపాత్రస్థితిన్
స్థిరకీర్తిం గడియించు కొంచుడివికి ♦ స్వేచ్ఛసి రాలంబు భీ
కరమై వచ్చె భయస్థు లుండుఁడు వెలిల్ ♦ రండాజికిన్ ధీరులై

అందఱు—(ఏకకంఠ్యముగా) మే మెల్లఁ దెగించి యున్నవారము చచ్చుటకును నైన సంసిద్ధముగా నున్నవారము.

నర— మహారాజా!

శా. తాతల్ తండ్రులు నేము మాసుతులు మా ♦ సైన్యంగులున్ మా భటుల్
మీతిండిం దినుచుంటి మీ మెయి గనన్ ♦ మీ దేసుఁడీ పోదునన్
మీతోఁ బాటు సుఖంబో దుఃఖమో పడన్ ♦ సిద్ధంబుగా నుంటిమో
హో! తీవ్రంబుగఁ జూచినన్ జెడెడుమే ♦ నాశించునే బేలయున్.

రాజా! బొబ్బిలిపురంబునం బుట్టినపిల్లికిని బిఱికికండ యుండదని నీవెన్నఁటికిం దలంపకుము. వీరెవ్వరును ప్రాణంబు లాశించి యున్నవారు కారు చచ్చుటకునైన సిద్ధంబుగా నున్నవారు. వారికీయుద్ధం బెంత? ఇట్టిచో నిట్లానతిచ్చుట ధర్మంబు కాదు. ఇంక నీవిచారంబు దక్కి కార్యంబు దెసవాఁడవు కమ్ము. లెమ్ము.

రంగా— వీరాధివీరులారా! మీరెల్లరు నాప్రాణబంధువులనియుఁ బ్రాణంబులకుం దెగించి యున్నవారనియు నేనెఱింగియుఁ గార్యాంతరవ్యగ్రహృదయుండ నగుటం జేసి యెఱుఁగనివాఁడఁ బోలె నిట్లంటిని గాని వేఱొండుగాదు. దీనికి మీ రెంతయుఁ జింతింపకుఁడు. నాపేరుగాని భారం బంతయు మీదియే. ముష్కరతురుష్క సైన్యంబు వచ్చి పడుచున్నది. లెండు కట్టాయితంబు గండు.

శా. లాడూఖాను తురుష్క సైన్యముకులన్ ♦ లాసూ పరాసీలకున్
బ్రోడల్ తేఁడులు గా నమర్పఁబడిరే ♦ పుం బ్రాపు దీపింపఁగా
నీడంబోవక వచ్చునాబలఁగ మెం ♦ తేడీల్పడం జేయువాఁ
డీడన్ మేల్దళవాయి గా సలుప రా ♦ దే మీకు మీసేనకున్.

ధర్మ— రాజా! ముంజేతికడియంబున కద్ద మేల?

ఉ. దండితవీరవైరిజని ♦ దర్పవిదారణదారుణాస్త్రిఁ డా
ఖండలశస్త్రతుల్యసద ♦ ఖండపరాక్రమవిక్రముండు మా
ర్తాండసదృక్షతీక్ష్ణకరుఁ ♦ డాహవదోహలమత్త చిత్తుఁ డీ
గండరగండ డైనయును ♦ గంటినృసింహ నృసింహం మీతఁడే.

అందఱు — (మేలు మేలని పలుకుచున్నారు.)

రంగా — క. మామా! సేనాపతివై
మామానము గాచిపుప్పు ♦ మా యిఁక మీఁదన్
మే మెల్ల నీదునుడిలో
నేమెయి వర్తించుచుందు ♦ మీయుద్ధమునన్.

(మెడలోఁ బూలదండ వైవ అందఱు కరతాళధ్వనులు చేయుదురు)

నర్సి — రాజా! సేనాపదంబున కంతసమర్థుండనుగాను, అయినను భారంబంతయు నాపైఁ బెట్టినారు కావున దేవరయాజ్ఞానుసారంబునం జేతనైనంతవట్టు కార్యంబు దెసవాఁడనై ప్రవర్తించెదం గాక (కలయం బరికించి) ఓహో! ప్రధానయోధులారా!

సీ. రేబవల్ విడకుండ ♦ నౌబత్తు మ్రోగింపుఁ
డెల్లబలంబు లా ♦ యితము గండు
కోటకొమ్మల మీఁదఁ ♦ మేటిసాధనములు
పాదుకొల్పుఁడు కత్తు ♦ లూఁది కొనుఁడు
మందుగుండు తుపాకి ♦ లందంద నిల్పుఁడు
కాఁగఁ బెట్టుఁడు నూనె ♦ కాకఁ దేలి
నలుగులు బల్లెము ♦ ల్లలి సాన బట్టుఁడు
విండ్లమ్ము లందుఁడు ♦ వేలకొలఁది
గీ. కరుల హారులను గైసేసి ♦ కడల నిల్పుఁ
డుష్ట్రములమీఁద సామగ్రు ♦ లుంచికొనుఁడు
పరిఘ నలుచక్కి దారుల ♦ భద్రపడుఁడు
బురుజాగము లెక్కి జోదులు ♦ పోరుకొనుఁడు.

మఱియుం గాకర్లపూడి వేంకటరాజు పశ్చిమంబునను, చెలికాని వెంకయ యుత్తరంబునను, దామెర ధర్మారాయఁడు తూరుపునను,

చెలికాని నరసయ్య దక్షిణంబునను వారివారి సేనలతో బురుజులెక్కి కోటను రక్షించుచుఁ బోరుచుందురుగాక. నేను నాయోపినంతవట్టు కోటచుట్టునుం జుట్టివచ్చుచుఁ బోరుచుందురు.

రంగా—మంత్రివర్యా! మనము దండోపాయంబునకు మున్ను రెండుపాయంబులు సర్వత్ర ముపయోగించితిమి. మఱియుఁ దృతీయో పాయంబునుం బ్రయోగింపవలసినవిధి యున్నదా లేదా?

నర—రాజా! దానం బ్రయోజనం బిసుమంతయును లేదు కాని దేవరచిత్తంబున నన్యథా ప్రవర్తించుట నాయిష్టంబు కాదు. కావున మఱియు నొక్కరాయబారిం బుస్సికడ కనుపుటయే యుత్తమము.

రంగా—మామా! దానికి నీవు తక్క మఱియెవ్వరు సమర్థులు? నీవే పోయి నేర్పునం బ్రవర్తించి రమ్ము.

వెంగ—క. అన్నా! క్రూరులు వారలు
మున్నీ ధర్మావనీశు ♦ ముట్టడి వెట్టన్
గన్నారఁ గనియు వినియున్
మిన్నక మఱి యితని నంప ♦ మేలే యటకున్.

నర—క. న న్నేమి సేయఁ గలవా
రన్నరనాథుఁడును బుస్సి ♦ హైదరుజంగున్
దిన్నఁగ నాకడ మఱియే
మన్నం దల లూడ వేయ ♦ నా? తెగి వత్తా!

రంగా—అమాత్యశేఖరా! పరాసుసైన్యంబు వచ్చి కోట ముట్టడించి యున్నది. నీవు తక్షణము రావలయు నని పాపారాయని కొక జాబు వ్రాసి పంపుము.

నర—(తాళపత్రము లిఖించి) భటులారా! మీరు కూరగాయ లమ్ముకొనునట్టి స్త్రీల వేషము వేసికొని రొట్టెలనడుమ నీజాబు వెట్టి

తురకలకుం దొరకకుండఁ దప్పించుకొనిపోయి రాజాముకోటలోనున్న మన పాపారాయని కిండు. సేర్పునం బ్రవర్తించి రండు, (జాబిచ్చును)

భటు—చిత్తము. (జాబు గొని నిష్క్రమించుచున్నారు)

(తెరలో రణభేరి మ్రోగును)

రంగా—(సంభ్రమముతో) వీరాగ్రేసరులారా! అదిగో రణభేరి మ్రోగుచున్నది. లెండు. మీరెల్లరు యుద్ధసన్నద్ధులు కండు. నే నంతఃపురాంగనల నూరార్చి వచ్చెదను. (అసి లేచుచున్నాఁడు.)

(అందరు లేచి నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము

— —

-

శ్రీ

# బొబ్బిలియుద్ధము

## చతుర్థాంకము

స్థలము! కోటలో గోపాలస్వామి మందిరము.

[పురోహితుఁడు పూజించుచుండ దాసీలక్ష్మి యుపచారము చేయుచుండఁ గుమారునితో మల్లమాదేవి ప్రవేశించుచున్నది]

మల్ల — ఓభట్టారకా!

మ. జగతీలోకము దైవముం దలఁచు నాదైవంబు మంత్రంబులం
దగులున్ మంత్రము బ్రాహ్మణోత్తములపాల్ తథ్యంబుగా బ్రాహ్మణుల్
జగతీదేవులు తత్కృపారసమునన్ సర్వార్థులున్ వ్రీల మే
లగు మీరట్టి మహానుభావు లెద మమ్మాలించి రక్షింపుడీ.

గీ. ఆధు లడఁగించి వ్యాధుల ♦ నవలఁ ద్రోలి
మృత్యుదారిద్ర్యములు తల ♦ లెత్తకుండ
సలిపి జగ మేలు మీపాద ♦ జలజములకు
మొక్కు చుంటిమి మముఁ బ్రోవ ♦ దిక్కు మీరు.

పురో — అమ్మా! బ్రాహ్మణప్రభావం బిట్టిదియే కాని దైవ మనుకూలింప నప్పు డెవరేమి చేయఁగలరు? కానిమ్ము మన కీ గోపాలమూర్తి యిష్టదైవంబు గదా. ఇతని సేవించిన సకలార్థసంసిద్ధి యగును గావున నితనిం బ్రార్థింపుము.

మల్ల — (లేచి చేతులు జోడించుకొని)

మ. కులదైవంబవయై ప్రభావనిధివై ♦ ఘోరామయధ్వంసివై
కలకాలంబుగ నిచ్చటన్ వెలసి మా ♦ కష్టంబు లెవ్వేళలం

దొలఁగం జేయుచు మమ్ముఁ బ్రోతు విపుడీ ♦ మహాఘాబ్ధిలోనుండి మా
కొలమెల్లం దరిజేరఁ జేయవె దయన్ ♦ గోపాలచూడామణీ.

కోకిల. పిఱింగిగములను బరంగిమూఁకలు ♦ వేలకు వేలయి ప్రోలన్
దూరంబు సలుపఁగఁ గరంబువీఁకను ♦ బుర్గముచుట్టునుజాలన్
బిరానఁ గవిసిరి స్థిరానుభావము ♦ పెంపుఁ బోరుదు రేలా?
వరాలొసఁగిదయ మొరాలకింపవు ♦ భారముకోయదుబాలా

గీ. లక్షలకొలంది నీకోట ♦ వీక్షణముగఁ
గూల్ప నీవారి సమరాగ్నిఁ ♦ గాల్పనెంచి
మూఁగికొనియుండెఁ బరసేన ♦ లాఁగ లేము
మమ్ము మామానమును గాంచి ♦ మనుపవయ్య.

(కుమారుం జూపుచు)

ఉ. ఈసిసువొక్కఁ డీకులము ♦ నంతటి కీతనిఁ గూర్మినిప్పుడిన్
మానుగ రాజ్య మేలుకొను ♦ మార్గమునన్ బ్రతికించి ప్రోవరా
దా నిను వేఁడుకొంటినిగృ ♦ తాంజలినై సకలంబు నాశనం
బైనను సంతసంబ సుజ ♦ నాన్వయపాలక! గోపబాలకా.

పుర్ణో—హా! హా! దేవీ! యేమియిది? నీకొమారుఁ డొక్కఁడుని మాత్రము బ్రదికింపు మనియుఁ దక్కిన సకలంబు నాశనంబైన సంతసంబనియుఁ బలుకుచుంటివి? ఏమి యీయశ్లీలము? ఏమియీయమంగళము? సర్వదా మనకు దైవము మేలుసేయుగాక. పాపము శమించుగాక, యమంగళ మడంగుఁగాక.

మల్ల—హా! హా! ఎంతపాప మెంతపాపము! మాకులమునంతకి యొక్క నిసు వుండెననియు, మమ్ము రాజ్యమేలుకొను నట్లు చేయుమనియు సర్వవినాశకరోప్రదవంబు వచ్చినది సమ్మతంబు కాదనియుఁ బలికిన నాపలుకశ్లీలంబుగాఁ బరిణమించినది. అయ్యో! అయ్యో! దైవము నానోట నిట్లుగాఁబలికించినదో? ఏయమంగళము రానున్నదో

హాహాప!!! (గుడిలోఁ బెద్దచప్పుడు దీపము లారిపోవుచున్నవి.)

పుహో.—ఏమి ఈ యమంగళము! ఏమి ఈ యపశకునము! దేవీ! యేదో కీడు మూడఁ దలఁచుకొనియే యున్నది

గీ. కలుగఁ బోవు శుభాశుభ ♦ కర్మములను
నరుల కెఱిఁగించుటకు మున్న ♦ నలువ్రచియాఱ
ఘనుఁడు సర్వజ్ఞుఁ డా దేవుఁ ♦ డనుచునట్టి
దూత లనఁగను శకునముల్ ♦ దోఁచుచుండు.

మల్ల—హాహా! దైవసంకల్పము! హా! పరమేశ్వరా!

చ. అసదల మై నశింపఁ దగునట్టిది ♦ కాల మువచ్చి మాపయిన్
బెనగొని యుండె నిప్పు, ఖల ♦ వృత్తిని దొల్లిటిజాములందు మే
మొనరిఁచినట్టి దుష్కృతుల ♦ కున్నఫలం బిదె దీని మేను పొం
దనగు నెవండును వ్యాధిబి ♦ ధానము దాటఁగ నోపఁ డక్కటా!

గోపాలమూర్తియు నాపాటుఁ జూడ లేనివాఁడుంబలెఁ బశ్చాన్ముఖంబు పెట్టినట్లు నాకుఁ గాఁడగట్టుచున్న వాఁడు. స్వామీ! యేమి నా దురదృష్టము!

మ. ఖలు లీవెల్మయు పిరికై సుముఖతన్ ♦ గష్టరా దంచునా?
నలవంతంబను నాము నంగ నింపై ♦ ఫన్ గని చిత్తార్తినా?
తొలగింపం బడరాని పీడ యని బీ ♦ తుం గొంటనా? యిట్టు ల
వ్వలమోమై తిరి యేమియాయను దయన్ ♦ బాలింపు గోపాలకా!

(కుడికన్నదరుటను సూచించి) హాహా! ఎట్టిదుశ్శకునము లగుచున్నవి. హాహా! పరమేశ్వరా! (పడి మూర్ఛిల్లుచున్నది.)

దాసి—(పొదివికొని శైత్యోపచారములు సేయుచు)

సీ. చచ్చినసుతు నగ్ని ♦ సంస్కారమునఁ గూర్చు
విధిఁ జంద్రమతి చాల ♦ వెతలఁబడదె
యడవిలో మగఁడు త ♦ న్నడబాసి పోయిన
దమయంతి యెంతో సం ♦ తాపపడదె

తనభర్త ప్రాణముల్ ♦ గొనిపోవు యమునితో
నెదిరించి సావిత్రి ♦ గొదలఁ బడదె
అక్కసమూకల ♦ చిక్కనంబడి విదే
శమున సీతాదేవి ♦ శ్రమలఁబడదె

గీ. అరులు సభలోనఁ గొని మాన ♦ హాని సేయు
నడలి పాంచాలిపుత్రిక ♦ బడలు వడదె
మఱియు నెందఱెందఱో సతీ ♦ మణులు సౌఖ్య
మందరే దీని కింతేల ♦ మఱఁద కూన.

తల్లీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. నీవట్లు తల్లడంపడ నీకుమారుం డెట్లుడిల్లిపోయి బిక్కచచ్చియున్నవాఁడో చూడుము. ధీరస్వాంతవు నీ కింత వలవంత తగదు లెమ్ము సేదదేరి కార్యంబు దెసగానవుగమ్మ నీప్రియుండు మహాబలపరాక్రమవంతుఁ డగుటంజేసి నీ పరాసుల నెల్ల బరాసులం జేసి నీకానందం బాపాదింపఁ గలఁడు. ఉన్మీలింపకుము. చిత్తవికారజమ్ము లగు శకునమ్ములు విఫలమ్ములగు నమ్మా. చింతాజ్వరసంతప్తచిత్తవగు నీకిప్పుడన్నియు నపశకునము లట్లే తోఁచుచున్నవి. కానిమ్ము. వీని కనేక శాంతిక పౌష్టికవిధు లున్నవని పెద్దలు చెప్పుదురు. బ్రాహ్మణసమారాధనంబు గావించి ప్రతిక్రియఁ జేసికొందము. కొందల మందకుము లెమ్ము. కష్టసుఖంబు లెట్టివారికిని గావడి కుండలు. (వింజామర వేయుచున్నది)

మల్ల—(లబ్ధసంజ్ఞయై లేచి) అయ్యో! నాకెట్టి పాడుకల వచ్చినది దైవమా? నే నేమి చేయుదు నోయి!

చ. బలువుగఁ బుట్టిపుండు సలు ♦ పన్ వెతఁ జెందుచునుండ దానిపై
నిలువున మోదు గొట్టినటు ♦ నేఁ బెగడొందుచు గోపబాలునిన్
గొలువఁగ రా నమంగళము ♦ కూడఁగవచ్చెను దుర్నిమిత్తముల్
కలలును గీడు చెప్పి మదిఁ ♦ గాల్చుచు నున్న విఁకెట్లొ దైవమా.

దాసి—అమ్మా! కల యేమి? నీకు నిద్ర యెక్కడ? పగఁటి కలలు పాటింపనమ్మునా? అయినను వృత్తాంతమేమి?

మల్ల—నాకల నిక్కమనియే తోఁచుచున్నది. విను. నేనిపుడు దుఃఖాక్రాంతచిత్తనై మూర్ఛఁబడి యుండ నాకంటె కొక్కనల్లని పురుషుండు పొడుగునం బొడకట్టి నట్టయ్యె. అంతలో నాఘాతుకుండు నామంగళసూత్రంబు ద్రెంచి నామగనిం గట్టిగ పట్టుకొని పోవుటకుం బ్రయత్నించె.

(తెరలో) ఓరోరీ! మహాపాతకవర్తీ! క్రూరాత్ముఁడా! ఎవఁడురా నీవు?

శా. నేనుండన్ నను గట్టి నాదుగరితన్ ♦ జేముట్టి తత్కాంతసూ
త్రామానప్రభఁ దూఁచఁ జేసి కపట ♦ వ్యాపారముం బొంది తో
రా! నన్నున్ గపురూపకల్పమనునన్ ♦ రంగక్షమావల్లభున్
గానం జాలవు రా ధరన్ బ్రదుకఁగా ♦ గాంక్షింపవా! దుర్మతీ.

శా. పాతాళంబున దూరినన్ మఱి నభో ♦ భాగంబునం బాఱినన్
స్ఫీతాంభోనిధి డాఁగినన్ దెసలకు ♦ వేగంబుమై నేగినన్
భూతప్రేతపిశాచశాకినులతోఁ ♦ బోరాడఁగా మూఁగినన్
నీతల్లిం గతపుత్రఁ జేసెదను ని ♦ ర్ణిద్రాసిపత్రంబునన్.

(అని చదువుచు మహాక్రోధమునఁ గత్తి జళిపించుచు రంగారావు ప్రవేశించును.)

రంగా—దేవీ! నిన్నుఁ గొట్టి నన్నుంగట్ట నెంచిన దుష్టాత్ముఁ డేఁడీ? వాని నీక్షణంబున నీకరవాలంబున శాహారంబుగావించెద.

మల్ల—హా! నాథా! సకలజగదేకవల్లభా! అనాథను నన్ను రక్షింపుము. రక్షింపుము. (కాళ్ళమీఁదఁ బడుచున్నది.)

రంగా—(లేవనెత్తియూఱార్చుచు) దేవీ! నిన్నుఁగొట్టి నన్ను గట్టనెంచిన దుష్టాత్ముఁడేఁడీ! వాని నీ కరవాలంబున శాహారంబు గావించెదను.

మల్ల—(కంట నీరుపెట్టుచు) నాథా! నీ వుండ నిన్నుఁ గట్టి నీ ప్రాణేశ్వరిం గొట్టువాఁ డెవ్వఁడు?

రంగా—ఎవ్వఁడును లేడా ? లేనిచో ని ట్లేల పలవించితివి ?

మల్ల—అది దుస్వప్నము మహారాజా !

రంగా—కం బేలా యేలా యిటు దీ
నాలాపము లాడుచుంటి ? యకటా తగునే
జాలిం బడ రంగమహీ
పాలుని సతి వయ్యుఁ జింత ? పాలైతి గదే

మల్ల—ప్రాణేశ్వరా ! మనకిప్పుడు దుర్నిమిత్తములే తోఁచుచున్నయవి. దుర్నయులా హైదరుజంగుతోఁ బోరుసలుపక సంధిం జేసికొని కులంబు రక్షింపు మో దాక్షిణ్యనిధీ ! నీకు నమస్కారము

రంగా—సంధి చేసికొను నెంతయో ప్రయత్నించితిని గాని యది పొసంగినది కాదు. యుద్ధమే సిద్ధమైనది.

మల్ల—సంధి వచనంబు లెట్లు నడచెను ?

రంగా—"మీ కీవలసిన పన్నునంతయు నిచ్చుటయు కాక మఱి యెంత పైకమైన నిచ్చుకొందుము. మాపైఁ జలం బుడిగి తొలంగి పొండనినఁ బరాసుల బూసి రోసంబున నన్ను విజయరాముని కాళ్ళంబడి ప్రార్థింపు" మని చెప్పినాఁడు. దానికి నే నంగీకరింప లేదు.

మల్ల—(చేతులు జోడించుకొని) జీవితేశ్వరా! దాసురాలి ప్రార్థన లంగీకరింపుము. కోపింపకుము,

చ. వయసునఁ బెద్దవాఁడు బల ♦ వంతుఁడు క్షత్రియుఁడర్థవంతుడున్
భయరహితుండు బుస్సిదొరం ♦ ప్రాపకమున్ గలవాఁడు రామరా
డ్జయమును గోరి తేని యిపు ♦ డాయన సఖ్యము చేసికొంటయే
నయమననొప్పుఁగాని జన ♦ నాయక! యొండొకఁడైనముప్పగున్

ఆ. వె. దాసురాలిమాట ♦ త్రోసివేయక చిత్త
మందు నాగ్రహంబు ♦ నాననీక
యాలుగోల బాలు ♦ గోల గాకుండఁగాఁ
గులము నెల్లఁ బ్రోవఁ ♦ దలఁపు మీశ.

రంగా — (ఆగ్రహముతోఁ గ్రోధించి) ఛీఛీ మూఢాత్ములారా

ఉ. ఏమఁట ప్రేలితీవు గుణహీనుఁడు రాయచేంద్రు కాళులన్
మేము కులాభిమానమును ♦ మీఱి, పరాక్రమ ముజ్ఝగించి, నే
వామతిఁ జేరి మ్రొక్కి ఖల ♦ పద్ధతిమై బ్రతుకంగఁ బాడియే
యీమెయి నిల్చుకంటె నశి ♦ యించిన గూడదె పౌరుషంబునన్

పరాక్రమైక జీవనుల సబొబ్బిలివారందఱును జాపం జావసిద్ధంబుగా నున్నవారు. భయంబయేని యంతఃపురాంగన లెల్లర బాలవృద్ధసమేతంబుగా నొంటుకడకు బుత్తెంము; పోయి ప్రాణములు గాపాడుకొనుఁడు.

మల్ల —(గడగడ వడంకుచు) ప్రాణేశ్వరా! స్త్రీచాపలమ్మునం జేసి బేలనై తెలియక యాడిన నాపలుకుల కలుకఁ జెందకుఁడు. సర్వలోకరక్షాదక్షులగు వీరపురుషులే పోవుచున్న నాకు మాత్రము మీ ప్రాణంబులు రక్షణీయంబులా? నేనును బౌరుషాభిమానంబులు గలవెలమ కడుపునం బుట్టితిని గాని పిఱికిపందను గాను. సమయానుకూలసామంబునఁ గార్యసాధన మగునో యని పల్కితిని గాని మఱియొండే మియుం గాదు. నాతప్పు సైఁచి కాచి రక్షింపుమని ప్రార్థించుచున్నదాన (పాదములపైఁ బడును.)

రంగా —ప్రాణేశ్వరీ! ఇపుడు గదా వీరపత్నివైతివి, వీరమాతవనిపించుకొనుభాగ్యము నకుఁబట్టలేదు. దాని కేవరేమిచేయఁగలరు! ఇంక నీవంతరంగంబునఁ జింత దక్కి యుండుము. కుమారుం (గుచ్చి కౌఁగిలించుకొని) నాయనా! చిరంజీవీ! నీవు—

చ. పెఱిఁగియు బెద్దవాఁడ వయి ♦ పిద్దెలు నేరిచి యుద్ధభూములన్
గటకరి శత్రులన్ నఱికి ♦ క్రాలఁగ జూచెడుభాగ్య మయ్యెకున్
దొరకం బోయెఁగా కొడుక! నోముఫలం బిటు లుండె నక్కటా
నెఱి గలవాఁడవై కులము ♦ నీటికిఁ దప్పుఁడు మయ్య యెప్పుడున్.

క. నీ తాత తండ్రి తాతయు
నీతండ్రియు నెట్లు మనిరొ ♦ నీ వట్లు జగ

క్షాత్త్ర్య మీ మా [illegible] సంబుస
నే నను [illegible] నను బొంద్ర ♦ నెఱుఁగుము తండ్రీ.

(కన్నీరు విడుచుచున్నాఁడు.)

[తెరలో పిరంగులు పేలును. అంతట సంభ్రమమునఁ గంచుకి ప్రవేశించి]

కంచు—మహారాజ! మహాయుద్ధ మగుచున్నది.

రంగా—అప్పుడే యుద్ధమా? మన సేనాని వచ్చినాఁడా?

కంచు—మన సాంధ్రివిపుఁడు [illegible] రాయబారము కుదరమిఁ జేసి యిప్పుడే వచ్చినాఁడు.

రంగా—నాకడకు రానికారణ మేమి?

కంచు—అతఁడు వచ్చునప్పటికే వేనవేలు శత్రుసైన్యంబులు వచ్చి మనకోట చుట్టుముట్టడించి పిరంగులుగాల్చియు, తుపాకులు పేల్చియు బాణంబులు వఱపియు, కత్తుల మొత్తియు నీటెలం బొడిచియు, తోలు నిచ్చెనల వెంటఁ గోడపై కెగఁబ్రాకియు, నాటియు ననేక విధోపాయంబుల మనవారిని ఢీకొని భీకరం బోరాడుచుంటిరి. అది చూచి తానటు కదలి రా సనువు పడక పోయివచ్చిన వృత్తాంత మంతయు నాతోఁ జెప్పి నన్ను నీకడ కనిచినాఁడు మహారాజా!

రంగా—అక్కడ నడచిన రాయబార మేమి?

కంచు—మనవరసరాయఁడు డొక్కింత సైన్యంబుతో బుస్సీ కడ కరిగి "మమ్ము రామరాజు కాళ్ళఁ బడుమనుటయు బొబ్బిలిని విడిచి పొమ్మనుటయు నీకుఁ దగదు నీకుఁ గావలసినంత సొమ్మిచ్చెదము. పరాక్రమైక జీవను లగు మాకుఁ గయ్యమునకుఁ గాలుదువ్వుట మీకును విజయరామునకుంగీడునకాకరంబగు. మా పరాక్రమం బెట్టిదంటిరేని వినుము. మున్ను తుమ్మలగుంటయుద్ధములోలక్ష సైన్యముతో గోపాలరాజును, బలుసుపాటి మేటియుద్ధమున నేఁడు వేల యేనూఁటుదండుతో జగన్నాథరాజును బొబ్బిలివారి నెదిరించి నాశనంబగుటజగద్విదితము. అది

యిట్టుండ నిప్పు డీకతిపయజనంబుతో విజయరామరాజు నేరింప
జేసి మీరు తటస్థులై యున్నాఁడు. "మేము గెలిచిన విజయనగర
రాజ్యము మాకును, యతఁడు గెలిచిన బొబ్బిలిరాజ్య మతనికి నిప్పిం
పుఁడు. దుర్మార్గుడైన రాజుమాట నమ్మి మీరు మాపైఁ గత్తికట్టుట
ధర్మంబు గాదు. ప్రాణము లాసింపక మేమున్నవారము. పోరైనచో
మీరు మఱల యీదేశంబునకుఁ బోవుట లేదని తెలిసికొనుఁడు" అనిన
నతండు కోపించి హైదరుజంగుం బిలకించిన నతండు నరసరాయనిం
బట్టనెంచిన నతండు వారినెల్లం దునాతునియలుచేసివచ్చి మనవారిం
జేరి పోరుచున్నవాఁడు.

రంగా—హాహా! దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం గట్టనెంచినట్లు
దుర్మార్గుడు మన నరసరాయనిం గూడఁగట్ట నెంచిరా? కానీ మన
సేనాధీశ్వరుండు మంచి పనియే చేసి వచ్చినాఁడు కంచుకీ! మనవా
రెట్లు పోరుచున్నారు?

కంచు—మనవారెల్లరు కోటకొమ్మలెక్కి చెక్కు చెదరక చక్క
నిలిచి నానావిధాయుధవిద్యావైశద్యం బంతయు నగపరచుచుండిరి.
రాజా! మనయోధులమాట చెప్పనేల! మనదాసీజనంబును బురుజు
లెక్కి గోడలెగఁబ్రాకినచ్చువారిపై కాఁగిన నూనె చల్లియు జిగురుం
బళ్ళు నోసియు, గండోపలంబులు జారవిడిచియు, చీపురుతాటియాకులం
బెట్టి వారిం దగులఁబెట్టియు, జజాయిలుం జిచ్చుబుడ్లు దోరలుం
జిమ్మియు మఱియు ననేకవిధంబులం బీరువోక పోరుచున్నవారు.

రంగా—ఆహా! మనపై దాసదాసీజనంబునకుఁగూడ నెంత
విశ్వాస మున్నది! సరే మనయోధు లేమి చేయుచున్నవారు?

కంచు—మనయోధు లెల్లరు నా యాస్థానంబుల నిలిచి ఘోర
యుద్ధము చేయుచున్నవారు. నారసింహుండు నపరనారసింహునివలె
జూడనొప్పి యెల్లెడం దాన యగుచు నవక్రపరాక్రమంబు నెఱపు

చున్నవాఁడు. మఱియు మన పడాలరామన్నయు, ముత్యాలపాపయ్యయు బారుటీలలతో వేయిమందిని గ్రుందించినారు.

రంగా—బళిబళీ! వారు నాకు నమ్మినబంటులు కదా! కంచుకీ! మన వేంగళ్రాయఁ డెక్కడ? అతఁడు నాతమ్ముఁడగు పరాసులకుం దెలిసెనా? లేదా?

కంచు—అతనిం బరాసులగు పరాసులేమి తెలియ గలరు? హైదరు ప్రముఖముష్కరతురుష్క సైన్యమంతయు బాగుగా గుర్తించినది.

రంగా—(సంతోషముతో) ఏమీ! నాతమ్ముఁడు పరాసులంబరాసులం జేసి తురుష్కులం దూలపుచ్చినాఁడా! మేలుమేలు! తమ్ముఁడా! మేలుమేలు—(తెరలోఁ గలకలము ఫిరంగులు పేలును)

రంగా—(ఆకర్ణించి) ఓహో! మహాసంగ్రామము సాగుచున్నది. శత్రులుష్కులమిగిలి నట్లు వినవచ్చుచున్నది. నేనిటనుండ మనంబొప్పక వేగిరించుచున్నది, దేవీ! నేనిదె సమరంబునకుఁ బోవుచున్నాఁడను. నీ విట బ్రాహ్మణారాధనంబు గావించి యుక్తప్రకారంబున బ్రవర్తింపుము. మానము గాపాడుకొనుము.

మల్ల—(తల వంచి కన్నీరు విడుచుచు) హా! నాథా?

మ. ఇఁక నీజన్మమునందు నిన్ గనుట లే ♦ దీ పేదకున్ వెండి యిం
కొకలోకంబున నెప్పుడో కలుగ న ♦ య్యో జీవితేశా! మొగం
బోకమా ఱిట్టులు చూపు మీకనులతో ♦ నొప్పైననీరూపుచూ
చికడుం బొందిక డెందమందునిలుపన్ ♦ జింతింతు నశ్రాంతమున్.

క. సతతమునీరూపము నే, మతిఁదలఁచుచుమరణవేళ ♦ మఱువన యేనిన్
గతిగలదునిన్నుబొందఁగ, నతికరుణన్ మొముచూపి ♦ యరుగుమునాథా

రంగా—(చేయిపట్టుకొని) కాంతా! నీకింతసంతాపము చెల్లదు, ఎంతవారికిని జా వెప్పటికేని దప్పదిదియే విను.

మ. పురుకుత్సప్రభృతుల్ ధరాతలము సం ♦ పూర్ణప్రభావంబునన్
బరిపాలించి యొడల్ త్యజించి దివము ♦ బాలింపఁగా నేగి రో

క్రూరుండున్ శాశ్వతకీర్తికల్పకముగాఁ ♦ గన్పట్టిరే నేలపై
వరకీర్తిం జనువారు చచ్చియును జీవంబోన రెప్పట్టునన్.

అజ్ఞానురాలవయి నీవు దేనికిచింతింపకుము. ఏదియెట్లుకానున్నదో యది యట్లు కాకమానదు. మనము చేయఁగలది యింతయును లేదు. సర్వమును బురాకృతంబుననే నడచుచుండు. కావున నీవు దేవురించుచు గాలంబు వృధసేయక పరంబు విచారించుకొనుమ్ము పోయివచ్చెద ననుజ్ఞ యిమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల — హాహా! మహారాజశిక్షాప్రపాతము! అకాలబలాబువచ్చి పడిన నామనోరథమైన వనితాబహళి శాంతింపబడి యున్నవాఁడు! మందబుద్ధినగు నేను అజ్ఞానముననే జేసి స్వేచ్ఛాంబయును ప్రాపంచికసుఖంబపేక్షించి మహారాజుమదిని గలంగఁ జేసితి నాహా! ఎంతధైర్య మెంత సాహస మెంత శౌర్యము! పురుషు లన్న నావువారే పురుషులు గాని తక్కినవారిం జెప్పవలయునా? (పురోహితునింజూచి) భట్టారకా! నీవుపోయి శాంతిక పౌష్టిక విధులం దీర్పుము.

పు—చిత్తము దేవిగారియాజ్ఞ. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల—చేటీ! పిత్రమహారాజుగారి యొద్దకు బంచిన కంచుకి రాలే దేమికారణమో? ఆయన నా సందేశమున మనల ననుగ్రహించు ననియే నా నమ్మకము.

దాసి—అమ్మా! దుర్మార్గుఁ డాతఁడు. నాకు మాత్రము నమ్మకము లేదు. అయినను సందేశ మేమని?

మల్ల—వినుము.

శా. నాకుం దండ్రివి నీవు నీసుతను నే ♦ నాకష్టసౌఖ్యంబులన్
నీకు న్వాకొన నొప్పఁ గావునను దం ♦ డ్రీ నన్ను మన్నింపవే
లోకు ల్గొంకులు వారికై స్వజనముల్ ♦ లోడింపఁగా నొప్పునే
నాకుం గుంకుమబొట్టునిల్పి కరుణన్ ♦ రక్షింపవే మ్రొక్కెదన్.

10

అని నే నంపిన సందేశము. విజయరామరాజు పిల్లలగి న్నవాఁడు కాని గొడ్డువాఁడు కాఁడు. నాదీనాలాపము లాలించి నన్ను మన్నింపక పోఁడు.

దాసి—దేవీ!—దేవర యీ సందేశము విన్నచోఁ బ్రమాదమే వచ్చును.

మల్ల—వేంకటలక్ష్మీ! తల్లి లేని యీ పిల్లవాని భారము నీదియే సుమీ.

దాసి—అమ్మా! నీ విట్లనకుము. నీమగండు సకలశత్రుక్షయంబు చేసి నిష్కంటకముగా రాజ్య మేలంగలండు. విచారింపకుము.

కుమా—అమ్మా నాకు బుల్లి కత్తిత్తే వాల్లందర్నీ కొత్తి కొత్తి సంపొత్తాను. లచ్చిమీ! నన్నెత్తుకపో, అమ్మా! యేదవకే యేదవకే, బయ్యంలే దిప్పు డొత్తాను. (అని లేచుచున్నాఁడు.)

దాసి—అమ్మా! పులిపిల్ల పులిపుల్లయేగాని పిల్లిపిల్లయగునా? రంగారాయ మహారాజచంద్రునకుఁ బుట్టిన వీని కిట్లు తగును సుమీ!

కంచు—(ప్రవేశించి) జయము జయము. మహారాజ్ఞి! నేను విజయరామరాజు నొద్దకు సందేశహరుండ నయి పోయి వచ్చి యున్నాఁడను.

మల్ల—ఏమి వృత్తాంతము?

కంచు—నీజాబు చూచి తానిట్లు వ్రాసియిచ్చినాడు.

మల్ల—దాని విప్పి నీవే చదువుము. వినియెదను.

కంచు—(విప్పి చదువుచున్నాఁడు)

శా. నాకుం గూఁతురువంటిదాన వయినన్, రాజన్యధర్మం బటన్
జేకొంచున్ వధియించుటల్ విధి యికన్ ♦ నీనాథునిం జంపెదన్
నీకే నిచ్చెదఁ గొన్నియూళ్ళు భృతికిన్ ♦ నీతాలె బొట్టాపఁగా
లేకున్నందుల కాత్మఁగుందకుము త ♦ ల్లీ! మల్లమాంబా సతీ.

మల్ల—(నివ్వెరపడి) అన్నా! అన్నా! అన్నా! దుర్మార్గుఁ డెట్లు వ్రాసినాడు! తెలవయి నేనట్లు జాలిగా వ్రాసినా, నానాథునిం జంపి

నాకుఁ గొన్నియూళ్ళు భరణమిచ్చునఁట! హాహా ఎంతదౌష్ట్యము!
ఎంతపాపము? హాహా! పాపాత్ముఁడా! క్రూరుఁడా! ఇట్లు వ్రాయుటకు
నీచే యెట్లాడెనురా? కఠినాత్మా! నావ్రాఁతకు ఱాయియుఁ గఱఁగును
గాని నీచిత్తమెంత కఠినమో కొంచెమును గఱఁగ లేదురా గురు
ద్రోహీ! నాకెట్టియుత్తర మిచ్చితివిరా! పాపీ! చండాల! నీది పిల్లలం
గన్న కడుపుకాదురా? (లేచి దుఃఖముతో చేతులు జోడించుకొని)

ఉ. నేను మహాపతివ్రతన ♦ యేని బరార్తిని గోర నేని నా
 మానస మెప్పుడున్ సుకృత ♦ మార్గమునందె మెలంగు నేని: కన్
 గానక భర్తఁ జంపి భర ♦ ణంబు నొసంచెద నన్న దుష్టభూ
 జానికులంబు నష్టమగు ♦ సంతత కష్టములంది కుందుచున్.

మఱియు నన్నిట్లుడికించినవాఁడును వానిఁ బురస్కరించుకొని
పాపంబున కొడిగట్టిన హైదరుజంగును నేఁటికి మూఁడవనాఁడు దుర్మ
రణంబు నొందుదురుగాక, వర్తకముపేర నీదేశముఁజొచ్చి మహా
రాజు కులంబులెల్ల మాయించి పరాక్రమంబున నాక్రమించుటయు
కాక మమ్ము నున్మూలింప నెంచినసరాసుల కిటఁ బాలనాధికారంబు
పటాపంచలగుం గాక. (అని భూమిం గొట్టుచున్నది)

కుమా—(తల్లిం బొదివికొని) అమ్మా! మా బాబయ్యగారితో
కూడా వెల్లి వాన్ని పొరిచొత్తాం. అమ్మా! యేదవకే. యేదవకే.

మల్ల-(కుమారునిశిరము పుడుకుచు) నాయనా! మీ నాయనగారికి
నీవు తోడుపడుభాగ్యము పట్టలేదోయి! మందభాగ్యులము; మేము
నీయానంద మనుభవింప నోచుకొనలేదు. తండ్రీ! మే మెట్లయిన నీవు
చిరంజీవి వయి బొబ్బిలిం బరిపాలించుచుఁ గులం బుద్ధరింపుమా. మా
యన్న! నిన్నయినఁ బ్రతికించుకొనుమార్గము తోఁపక త్రొక్కుళ్లు
పడుచున్నదాన నోయి బిడ్డా! (జ్ఞాపక మభినయించి) వేంకటలక్ష్మి

చ. అరణపుదాదివీవు నను ♦ నక్కటికంబునఁ గన్నవారినిన్
 మరియును గొన్నవారిని స ♦ మానముగా మదిలోఁ దలంచుచున్

గురుతరభక్తియుక్తిఁ బిల ♦ నుంగొనుచున్ బిరుదంబు నానుడిన్
బరఁగుచుఁ గష్టసౌఖ్యముల ♦ నాకయి యుంటివి గాదె యింతకున్.

గీ. నాకుఁ బరమోపకారము ♦ లొక్క మెన్న
నట్లు చేయంగ వలసిన ♦ యదను వచ్చె
నిపుడు నీవది చేసి నన్ ♦ గృపను జూతొ
కాక కాదందువో కాని ♦ కమలపాణి.

దాసి—అమ్మా! యిదియేమి? నన్నింతగా స్తుతించుచుంటివి? నీ దాసదాసీజనంబు ప్రాణము లయిన సమర్పించుటకు సంసిద్ధముగా నున్నదిసుమీ! సంశయింపకుము నేఁ జేయ నగున దేమో చెప్పుము.

మల్ల—ఓసీ! వేంకటలక్ష్మీ! ఇప్పుడు మహాయుద్ధంబున రావువారెల్లం దెగుట సిద్ధంబు ఆ సందర్భమున నంతఃపురాంగనలకును మరణంబు సిద్ధాంతంబు కావున వంశవృక్షాంకురం బగు నీకుమారు నెటులేని నీవు రక్షింపవలయు నని నిన్నిట్లు ప్రార్థించుచున్నదాన.

దాసి—దేవీ! నన్నుఁ బ్రేమించి పెంచుచున్న రాణివాసమె పోయిన నేను మాత్ర మీపాడుశరీరమును గాపాడుకొనుచుండఁ గలనా? అట్లుగాక కుమారుం బ్రదికించుమార్గ మున్నం జెప్పు మట్టుచేసెదను.

మల్ల—సామర్లకోటలో నాచెల్లెలు జగ్గయ్యదేవి యున్నదికదా? అట కీబాలునిం గొనిపోయి విడిచి రమ్ము.

దాసి—అయ్యో! కోటచుట్టును శత్రువులు ముట్టడించియున్నవారు, వారిం దప్పించుకొని నే నీకుమారు నెట్లు సామర్లకోటం జేర్పఁగలను?

మల్ల—వీనికి బ్రాహ్మణకుమారవేషంబు వేసి తీసికొనిపొమ్ము, నీకీ కంచుకియుఁ దోడువచ్చును.

దాసి—చిత్తము. దేవిగారియాజ్ఞ.

కుమా—ఊఁ! ఊఁ! ఊఁ! ఊఁ! నేను సామద్దకోత కెళ్లను. యుద్ధానికి వెత్తాను ఊఁ!ఊఁ!ఊఁ!ఊఁ! (మూలుగుచు గారాబము చేయును).

మల్ల—(కుమారుం బొదివికొని దుఃఖించుచు) నాయనా! చిన వేంకటరాయా! నీవు సామర్లకోట కీ దాసీలక్ష్మితో వెళ్ళుచుతండ్రీ! అక్కడ నిన్నుఁ బ్రేమించు నీపినతల్లి యున్నది. నీయన్నదమ్ములక్క చెల్లెండ్రు నున్నారు. వారితో నీవు నాడుకొనుచుఁ బాడుకొనుచు సుఖముగాఁ గొన్నాళ్లుండవచ్చును దండ్రీ! మఱియు నా సామర్ల కోటలో—

సీ. వన్నెచిన్నెలతోడ ♦ వన్నెకెక్కినగురాల్
గున్నయేనుంగులు ♦ నొన్ని గలవు
పొన్ను కత్తులనాఁడు ♦ పిన్నవస్తాదులు
సాములగరిడీలు ♦ చాల గలవు
కన్నులపండువై ♦ కమలముల్ వికసింప
వెలయు కేళాకుల్ ♦ పెక్కు గలవు
చిలుకలు గోరువం ♦ కలు నల్కఁగనులపం
డుగ సేయు నుపవనుల్ ♦ మిగులఁ గలవు.

గీ. ఆటపాటలు నను వొంటప ♦ మేటిబొమ్మ
పేటికలు నాటకమ్ములు ♦ వేటకుక్క
గములు సివంగులును బులు ♦ లెలుఁగుగొడ్లు
గలవు బాల్య వినోదముల్ ♦ సలుపఁ దండ్రి!

నాయనా! నీవీ దాసీలక్ష్మితో నటకుఁ బోయి రమ్ము తండ్రీ

కుమా—అమ్మా! సామద్దకోతనుంచి మళ్లీ దీనితోదానా? వత్తే నాకు తాయిద్దం పెత్తావా?

మల్ల—(దుఃఖించుచు) నాయనా!

శా. ఈజన్మంబున నేను వెండియును ని ♦ న్నీక్షింపఁగాఁ గల్గు నే
యోజాడన్ సృజియింపలేదు విధి కా ♦ లానన్న మై యుండెనా
కోజై వాత్సక! నీవు వెండియును రా నూరార్చి తాయిల్లమే
రోజుం బెట్టగఁ జాలు దాని దయలే ♦ కున్నట్టి నేనయ్యయో!

శా. నన్నుం గన్నకుమారు! నా ధనసిధీ! ♦ నాపాలిభాగ్యంబ! నా
యన్నా! ముద్దులపట్టి! నిన్ గనినవా ♦ రంతంతలం బట్టు వా
రెన్నందల్లియునై నందంద్రియయినన్ ♦ హెచ్చించినన్ కుంచినన్
నిన్నుం జూచిన జూడకుండినను దం ♦ డ్రీ! నీకు జగ్గాంబయే
హాహా! కుమారరత్నమా!

గీ. నిన్నుఁ గన్నది మొదలు గా ♦ నేటినఱకు
నిమిష మైనను విడనాడి ♦ నేడు గసలు
చున్నయది లేదు నేఁటి కా ♦ పన్నురాల
నగుచుఁ బరులపంచలకు ని ♦ న్నంపుచుంటి,

చ అరనిముసంబు నన్ గనమి ♦ నమ్మ యెటేగితి వమ్మయంచు బాఁ
పురు మని యేడ్చుచున్ బుడమిఁ ♦ బొర్లుచుచుంగువు కోపగించుచు
క్కఱఁ దిసిపింపఁ బోన నడ ♦ కింగను వయోగుణము గన్నతండ్రి! ని
న్నరసెడు వారలెవ్వరిఁక ♦ నమ్మయు నబ్బయు లేకపోయినన్.

నాయనా! నీవు పెఱిఁగి పెద్దవాడవై యువరాజ్యపట్టాభిషిక్తుఁడవై బొబ్బిలిం బాలింపఁ జూచి సంతసింపను నను కొంటిని తండ్రీ! నాకా భాగ్యంబు లేకపోయినది గదా!

చ. కొమరులు లేక లేక తుద ♦ కుం బగమేశునను గ్రహంబునన్
కొమరుఁడ వీవుపుట్టి తని ♦ కోరిక లీరిక లెత్తనుండి రీ
యమయమున నయ్యయున్నడచె ♦ నయ్యది యెల్లనుమూఁడునాళ్ళ నీ
సుముఖత వారి కెప్పటికిఁ ♦ జూచెడుభాగ్యము లేక పోయెఁగా.

(ధైర్యము తెచ్చుకొని తనలో) నేనిట్లు చింతించుచున్న ఫలవిఘాతం బగుఁ గావున వేగిరింపవలెను. (ప్రకాశముగా) చిరంజీవీ! నీవునీవారి కీర్తింగాపాడుచుబొబ్బిలినిపరిపాలింపుము, పోయిరమ్ము. (నంకకిచ్చును)

దాసి—(కుమారు నెత్తుకొని) అమ్మా! పోయివచ్చెద. (కంచుకితో నిష్క్రమించుచున్నది.)

మల్ల—(మహాధైర్యముతో) నాకు నిప్పటికి విశ్రాంతికలిగినది. ఇంక నేను నామగండును ఈతుచ్ఛశరీరంబులవిడిచి వీరస్వర్గంబున నిచ్ఛావిహారసౌఖ్యంబు లనుభవించెదము గాక. కాని నాకొక్క సందేహము. నేనును దక్కిన యీ యంతఃపురాంగనలును బ్రాణములు పాయుటెట్లో తెలియకున్నది. పరాసులు చెలరేగి కోటలోపలికిం జొరకమున్న మరణోపాయంబు చింతించుట పరమశ్రేయము. నామగండు గాని మఱియొకండు గాని వచ్చి స్త్రీల నెల్లరం ద్రెళ్ళనేసినచో ననుకూలంబుగా నుండునుగదా! (ఆలోచించుచున్నది.)

[అంత మఱియొక దాసి ప్రవేశించును.]

దాసి—అమ్మగారూ! మన చెలికాని వెంకయ్యగారువచ్చి వాకిట నిలిచియున్నారు. దేవిగారితో మనవి చేయు మని సెలవిచ్చినారు.

మల్ల—పితృప్రతిమానులగు వెంకయ్యగారికిం బ్రవేశింపరాని తావులు గలవే? శీఘ్రంబువ బ్రవేశపెట్టుము.

దాసి—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

వెంక—(ప్రవేశించుచు)

చ. అనదలు బేలలున్ జపల ♦ రాఘులు సాధువులున్ బతివ్రతల్
వనితలు వారిఁ జంపుమని ♦ వ్రాసెను నానుదుటన్ విధాత లోఁ
గసిగర మింత లేక, కను ♦ గానక తొంటిభవమ్ములందు నేఁ
బొనరిచినట్టిపాతకము ♦ వోయిది దీనికి వేరు దిక్కెదో!

మల్ల—బాబయ్యా! యేమి యీ వెఱ్ఱితనము!

చ. తెలియఁగ నెంతవారు నిలఁ ♦ ద్రెళ్ళిరి కాని యొకండు మిత్తిక
న్నులఁ మసిఁ బ్రామిపోల్చుటక ♦ నుంగొనియే వినియే యెఱుఁగమీ
పొలిసెడునంతయున్ వినియు ♦ బూమె లెఱింగియు నుట్టిగట్టియు
య్యేల లిటులాగుచుందు మని ♦ యెంచుట వెఱ్ఱితనంబకాదొకో.

మ. మనకుం దక్కినజంతుజాలములకున్ ♦ భావింప విజ్ఞాన మొం
దొనరున్ భేదము, సర్వమున్ సమతమై ♦ నుండునుగదా జ్ఞానులై

చనుమీవంటి నిక్కమైనస్మృతికిం ♦ జర్చింపగా న్యాయమే?
మును రామాదులు వోవరేయొక్కఁడు నే♦భూమిం దియుండ య్యెనే.

కావున నీ వెందులకును గొందఱంబడకుము. నీ వెందులకు వచ్చితివో చెప్పుము. రాజకార్యనిర్వాహకుఁడవు కమ్ము.

వెంక — అమ్మా! మహారాజు కత్తినిచ్చి నన్నంతఃపురమునకుం బొమ్మని యాజ్ఞాపించినాఁడు. వచ్చినపని నివేదింపుటకు నాకు నోరు రాక పరితపించుచున్నవాఁడ నమ్మా!

మల్ల — అయ్యా! నీవు వచ్చిన పని నాకు దెలియును దానికి నీవు చింతింప నక్కఱలేదు. తొల్లి మల్లానుద్దీను చిత్తూరుకోట ముట్టడించి నప్పుడు పద్మినీప్రముఖరాజపుత్రస్త్రీ లెల్లరును మానభంగము నగునని చిచ్చునం బడి చచ్చి ప్రఖ్యాతి నందరే! మాకును నట్టిఖ్యాతియే రాం దలంచుకొని యున్నది.

వెంక — అమ్మా! నాకుఁ జేతులాడకున్నవి నే నెట్లు రాజాజ్ఞం దీర్పఁ గలవాఁడనో తెలియకున్నది తల్లి!

మల్ల — చేతు లాడకున్నవి కాళ్ళాడకున్న వన్న మాటలం కట్టిపెట్టుము. కార్యంబు చెసవాఁడవుగమ్ము. నాకా మహారాజుకత్తి నిటు తెమ్ము. నీవులోపనకరిగి రాజాజ్ఞ నెఱవేర్పుము (కత్తిపుచ్చుకొనును)

వెంక — హాహా! పరమేశ్వరా! స్త్రీవధాపాతకంబున నన్నుం బడవైచితివా! హాహాహా! (అని లోపలికిఁ బోవుచున్నాఁడు.)

మల్ల — (కత్తికి నమస్కరించి)

మ. కలనైనం గలుమక్రియాభిముఖులై ♦ గన్పట్టు ధర్మస్వరూ
పులచేఁ దేజమునొంది నీవు జగమున్ ♦ బ్రోవంగ నెల్లప్పుడుం
ఖలులందున్మెదుదాన వేనిఁ దృటిలో ♦ నాకంఠముం ద్రుంచి నన్
గలిఁరున్ గూరిచి జీవితేశుపదముం ♦ గావం గదే శస్త్రమా!

(కత్తి యెత్తుచున్నది — తెర పడుచున్నది)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# బొబ్బిలి యుద్ధము



## సప్తమాంకము

స్థలము : యుద్ధభూమిలోని డేరా

[అంతట బాసిలక్ష్మన్నతో నాయకుండగు బుస్సీ ప్రవేశించుచున్నాడు]

బుస్సీ—లక్ష్మన్నా ! యుద్ధవిశేషము లేమి ? మనవీరు లెట్లు పోరుచున్నారు ?

లక్ష్మ—దేవా ! లాడూఖాన్ పురస్సరముగా మన సైన్యం బంతయు కోటలోనికి బ్రవేశించుట కనేక సాధనోపాయంబులం బ్రవర్తింపంజేసి చెట్టికిం జీమలు మూగినట్లు చుట్టును మూగి ముట్టడించె. అపుడు కోటలోని దాదులెల్లరును బురుజులెక్కి నూనె గాచి పోసియు, రాళ్లురువ్వియు, నగ్ని బాణంబు లేసియు శూలంబుల బొడిచియుం గత్తుల నొత్తియు, బోరి మనవారి నెల్లం బోల్ జేసిరి.

బుస్సీ—హాహా ! బొబ్బిలిలోనున్న దాదులకు నంత పౌరుషమా ? తరువాతి ?

లక్ష్మ—తరువాత నిరువాగు యోధులకును మహాయుద్ధం బయ్యె.

క. లాడూఖానుం డీసునఁ

బ్రోడతనంబున కోకింత ♦ మోసం బనుచున్

బోడిమిఁ దుపాకిగుండ్లకు

వీడక వప్రమున కెక్కి ♦ వెనఁగెం గడిమిన్.

బుస్సీ—హాహా ! లాడుఖా నెంతపని చేసినాఁడు !

(కోటలో పెద్ద కలకలము)

బుస్సీ—లక్ష్మన్నా, ఆ హాహాకారం బేమి?

లక్ష్మ—(పరికించి) పరాసువంశశేఖరా! మహోపద్రవము వచ్చినది. లాడూఖాను కోటపై కెక్కి పోరాడుచుండ వీరుం డొక్కం డుక్కున నాతనిం దుపాకివాతం బెట్టినతం 'హల్లానబీ' యని క్రిందికి బిల్లమిరంబు వేసి కూలినాడు.

బుస్సీ—హాహాహా! ఎంతపని జరిగింది! లాడూఖా నెంత పోరాటము చేసినాడు! తాను సేనానాయకుండై యుండియు కోట యెక్కుటకు సాహసింపవచ్చునా! ఆహా! బొబ్బిలివా రెంతశూరులు? ఎంతధీరులు! వారితో వైరము వలదన్న నామాట హైదరు వినకపోయెనుగదా? అయ్యో! సేనాపతి పోయిన సేన లెట్లు పనుచున్నవో కదా?

లక్ష్మ—హాహాకారము సేయుచు మనసైన్య మొంతయుం జెల్లాచెదరై పలాయనం గాంచి హైదరుజంగు చేయెత్తి పిలిచి లాడూప్రముఖులం బురికొలిపె; వారు నన్ని నిందించుకొనుచుం దెగించి కోటపై నోటలేక పడిరి. పూసపాటిరాజు తనదళముతో వారికిం దోడుబడియె అప్పుడు బొబ్బిలి యోధవరులు మహాధైర్యంబున నాయోధనంబు చేసి వారిం బారం దరిమిరని తెలియవచ్చినది.

బుస్సీ—ఆరెరే! మాలసూ విఱిగి పాఱినాడా! హాహా వీరవరులార! రంగారాయప్రధానయోధులారా! మీరెంతం బరాక్రమవంతులు!

లక్ష్మ—అది యంతయుం గనుచున్న హైదరు.

శా. లాడూగూ లెనులాసుముఖ్యులు గడున్ ♦ లావేదివెన్నిచ్చి తా
రూడంబారిరి సర్వదేశముల మ ♦ న్నోడించు నా పేరునుం
బాడై పోయె నిం కేమిచేయుదును నా ♦ వా రెన్నగాం బేనవే
నాడన్ స్వల్పము వారి గెల్చుటయుం గ ♦ ష్టాసాధ్యమయ్యెం గటా.

అని చింతాక్రాంతచిత్తుండై తత్తరంపడుచు సేనకాజ్ఞాపించె అప్పుడు షుకురుల్లాఖాన్, హాసనల్లీఖాన్, సిద్దిబిలాల్, లాసూఖాన్, మొదల

లగు తురుష్క యోధులును ఛత్రపతి రామచంద్ర ప్రభృతులలో విజయరామరాజును బుజికొని తనతన సేనలతో నగ్గడీచుట్టు ముట్ట డించినారు మహాప్రభూ!

(తెరలోఁ గలకము)

బుస్సీ—సందడియగుచున్న దది యేమి? చూడుము.

లక్ష్మ—(కొంచెము లేచిచూచి) హైదరుజంగుకు విజయరామ రాజు నెవరినో యిద్దఱ నాఁడువారిఁబట్టి యిటకుఁ దెచ్చుచున్నారు.

బుస్సీ—ఎవరువారు? వారిఁబట్టి తెచ్చుటకుఁ గారణమేమి? సరేవిచారింతుముగాక (అంత స్త్రీవేషధారులగుభటులును, దక్షిణ వారును ప్రవేశింతురు )

విజ—(సలాముచేసి) పరాసువంశాగ్రణీ! (భటులం జూపుచు) వీరిద్దఱును బొబ్బిలిదుర్గంబునుండి వచ్చుచుండ నాకారవాక్పరాక్రమా దులం బట్టి మాకనుమానంబు పుట్టి వీః నిటుపట్టి తెచ్చితిమి.

హైద—వీళ్ళేబదాష్మషల్ వున్నారు. వీళ్ళకి తగినా సిచ్చా సేయు వాలా వుందీ సర్కార్!

బుస్సీ—(పరికించి తేఱియూఁచి) మీరెవరు? ఎందుండువారు? ఇట కెందునిమిత్తము వచ్చియున్నారు?

భటు—అయ్యోర్యారు! మేము ఆడంగులము మాది బొ—కాదు గొల్లపల్లి. కూరలమ్ముకో వొచ్చి మోతున్నాం బాబు!

బుస్సీ—ఇంతదండు వచ్చి చుట్టును ముట్టడించి యున్నది. మీరు భయములేక లోని కేదారిని వెళ్లినారు?

భటు—బాబు! మాకు దండు బయ్యమే టండి మమ్మేమి సేస్తది? పెరటిదారిని కోటలో కెళ్ళొచ్చినాం సామి!

బుస్సీ—మీరు తాండ్రపాపయ్య నెఱుంగుదురా?

భటు—తెల్లోరి లేస్తే లచ్చాపదకొండుమాట్లొచ్చేవాళం పాయ్యేవోళ్ళం మాకు తెల్దా బాబూ! తెల్బు.

బుస్సీ—అతఁ డిపు డెక్కడ నున్నాఁడు? ఏమిచేయుచున్నాడు?

భటు—దొరగోరు! ఆదొరగోరు కోట్లోనే వున్నారండి. యుద్దప్ప యత్తం సేస్తున్నారు. బాబో! సెప్పలేమ్ ఆకత్తులేమ్ దుపాకులేమ్ లచ్చల్లచ్చగే పోగుసేశారు బాబు!

బుస్సీ—(భయముతోఁ దనలో) పాపారాయఁడు కోటలోనున్నచో నింక మనపని సున్నయే. కానివిచారించెదంగాక (ప్రకాశముగా) ఇంతసేనతో నతఁడు పోరుటకుఁ బ్రయత్నించుచున్నాఁడా? ఎట్లు పోరఁ గలఁడు?

భటు—ఆరికి బయ్యమేం బాబూ! సేత గత్తిముట్టారంటే మీ పిరంగీలు గిరంగీలు దుక్కుతుక్కయి యెగిరిపోతాయి నాసావిఁ రంగా!

విజ—పాపారాయునికిఁ బిరంగు లన్నభయమే లేదా? దానికేమి గాని అతఁ డిప్పుడు రాజ్యములోనుండఁ గోటలోనున్నాఁడందు రేమి?

హైద—వీళ్ళా దొంగల్మాటా సేప్తాదీ వుంది. వీళ్ళకీ తనిఖీ సెయ్యాపాలా హుజూర్!

బుస్సీ—మీమాటలు మాకు సందేహములుగా నున్నవి మిమ్ము బరీక్షించెదను.

భటు—అమ్మకో వచ్చినోళ్ళం మ మ్మెందుకండీ పరీచ్చ? మాకా జేటుందండి?

బుస్సీ—లేకున్నచో మాకు భయములేదు. మిమ్ము విడిచిపెట్టెదము. మీదుస్తులు వస్త్రపులనుం జూపుఁడు.

భటు—(భయముతో నొకరి లొకరు చూచుకొనుచున్నారు.)

విజ—ఏమి సంశయించుచున్నారు! మీరు కూర లమ్మవచ్చినవారేని మీకీభయ మేల?

హై.—మీకీ పరిచ్ఛ సేస్తాం నోయ్. లిన్గా సూపూ లేకపోతే తలా పోతాదీ మీకీ ఖబడ్దార్. (పట్టుకొనఁబోవుచున్నాఁడు.)

భటు—అయ్యో! సాయేబయ్య! నీకు సలాం. ఆడోళ్ళం ముట్టుకోక బాబు! తప్పు బాబు! అన్నీ సూపుతాం సూడు బాబూ!

(తట్టలు నేలఁ బస్వైచి కొట్టెలు మొదలైనవి వెదజిమ్ముచున్నారు)

బుస్సీ—(పరికించి) వీరిబట్టలలో నేమున్నదో కాని తట్టలలో నేమియు లేదు వీరు నిజముగాఁ గూరలమ్ముకోవచ్చినవారే యని నా యభిప్రాయము.

హైద—వీళ్యా దొంగల్ వున్నర్. వీళ్ళకీబట్టల్ తనికిసేసి నమ్మరాల వుంది. లేకపోతే సఫాయి సెయ్యాలా వుంది. (బట్టలాగఁ బోవును)

భటు—ఆడంగులం బాబో! ముట్టుకోకు బాబో! తప్పు బాబో! తప్పు బాబో! (అటుయిటుఁ బయిఁగు లెత్తుచున్నారు.)

హై.—అరే బద్మాష్! తమాషా కర్తే హేతూ!

(కొప్పుబట్టి లాగుచున్నాఁడు అదియూడి చేతిలోనికి వచ్చుచున్నది.)

హై.—క్యా గేభాయ్! మొగది వున్నదీ!

(కట్టుకొంగుబట్టి యూడలాగఁగా చడ్డీతోఁ బురుషుఁడు కనుపించును)

విజ—(రెండవవాని నట్లు చేయుచున్నాఁడు)

భటు—(మొలకు నొడ్డాణముగాఁ జుట్టుకొన్న కత్తులు తీసికొని త్రిప్పుచు) మేము రంగారాయని ప్రధానభటులము. స్త్రీలముకాము. పౌరుషముగల పురుషులము. పురుషులైనవారెందఱు మమ్మెదిరింపుఁడు.

అందఱు—(కత్తులు త్రిప్పుచుఁ దెరచాటునకుఁ బోవుదురు.)

బుస్సీ—లత్మన్నా! ఏమి యీ మహాయుద్ధము! ఇద్దఱతో నింతమంది పోరఁ జాలకున్నవారు? వీరు వీరపురుషులుగాని సామాన్యులుగారు. ఆహా! యేమి వీరికరలాఘవము! మండలాకార పరిభ్రమణంబున వీరికత్తి యెన్ని కుత్తుకలు తీసినవి?

(తెరలోఁ దుపాకులు ప్రేలుచున్నవి)

బుస్సీ—లక్ష్మన్నా! బొబ్బిలి భటులు కూలినట్లున్నారు పరీక్షింపుము.

లక్ష్మ—చిత్తము. దేవా! గోళ్ళఁ బోవుదానికి మనకు గొడ్డళ్ళు పట్టవలసి వచ్చుచున్నది.

అందఱు—(ప్రవేశించుచున్నారు)

బుస్సీ—ఆడవేషము వేసికొని వచ్చిన సామాన్యులిద్దఱే యిట్టి బీరంబు చూపిరి. వీరి మించిన వారెందఱుందురో? వారిం జంపుట మన కసాధ్యము. మన మింక మఱలి పోవలసినదే. పాపారాయఁడే కోటలో నున్నచో మనల నల్లుల నలిపినట్లు నలిపివేయక మానఁడు.

విజ—మహాప్రభూ! దేవరవారు దీని కింత చింతింపఁ బనిలేదు. పాపారాయఁడు లేఁడు. మనకీ యుద్ధమున విజయము సులభసాధ్యము.

లక్ష్మ—స్త్రీ వేషధారులిద్దఱును పాపరాయునికి వార్తాపత్రికం గొనిపోవుచున్నారని నా తలంపు.

విజ—ఇది యే నిజము. కాని వీరికడ జాబు కనంబడకుండుట యాశ్చర్యము.

అందఱు—(వెదకుచున్నారు)

లక్ష్మ—నాకుఁ జూడ జాబీరొట్టెలలో నుండునా యని తోచుచున్నది.

హైద—(రొట్టె నలిపి తాటియాకుం బట్టికొని) అరే హల్లా! రొట్టెలు సపుమా జాబుల్ పెట్టివండినార్. దేఖోయియా! దేఖో దేఖో

విజ—(పుచ్చుకొని కడిగి తుడిచి) అన్నా! ఎంత మోసగాండ్రు బొబ్బిలివారు! పిండిలో జాబు పెట్టి రొట్టె కాల్చుట యెచ్చటను జూడలేదు. హా హా హా! (అందఱకుం జూపుచున్నాఁడు)

బుస్సీ—రాజా! జాబు చదువుము.

విజ—చిత్తము. (చదువుచున్నాఁడు)

నా ప్రియమైన బావపాపారాయనికి రంగారాయఁడు వ్రాయు విజ్ఞాపనము.

శా. బావా! రాముఁ డమోఘసత్కృత్యమున లో ♦ భస్వాంతులా శాత్రవుల్
వేవేల్ క్రోశములు గానిక్రోశములు దో ♦ ర్వీర్యంబునన్ వచ్చిబల్
తేవం గోటను ముట్టడించి రిపుఁ డు ♦ ద్దీనంబునన్ వచ్చి నీ
చేవం జూపి విపత్తునుండి తొలఁగం ♦ జేయుం గదే నీప్రజన్.

రంగారాయఁడు.

బుస్సీ.—అమ్మయ్యా! ఇప్పటికి నాను గుండె నిబ్బరమైనది. పాపయ్య కోటలో లేనిమాట నిశ్చయమైనది.

విజ—దేవా! నేను మనవి చేసికొనియుండ లేదా?

శా. ఏపుం జూపెడునట్టి క్రోలుపులి కిం ♦ తే దగ్గిపోనట్టి యా
పాపారాయఁడు లేఁడు నీటఁ బొరుల్ ♦ భావింపగా నతఁడా
రీపట్లన్ నెఱకాఁడు లేని చెలి న ♦ ట్లీకోటఁ జూడాయలన్
జేపట్టం దగు నీవు యోధుల కిఁకం ♦ జింతింపఁగా నేటికిన్.

హై—పాపయ్యాకీ హింతా ఫికరూ పడతాన్ హామాకాద్ వాడి తాతా వస్తే నేమిహోయి చనంలో పీల్చి చేస్తామ్.

లక్ష్మ—

మ. యవనాధీశ్వర! తాండ్రపాపయ మహా ♦ ప్రారంభశుంభత్ప్రభా
వవిధిజ్ఞుం డని నాతనుం దెలిసె నీ ♦ వాక్యంబు కాదం చనం
దవులం గాని జయింపరా దతని నీ ♦ దండంతయుం గూడినన్
నవిమర్శంబులు రామరాజునకు లె ♦ న్నన్ దీని కిం తేటికిన్.

బుస్సీ—మన కిపు డావిషయమై చర్చింపవలసిన పనిలేదు. పాపారాయఁడు మహాసమర్థుఁ డనుట నిర్వివాదాంశము. ఏది యెట్లయిన నతఁడు లేఁడు గావున మనకు విజయం బగు నింక మీరెల్లఁ జింతఁ దక్కి పోరునకుం బొండు. (తెరలో గలగల)

దౌవారికుఁడు—(ప్రవేశించి) సలామూ లేకుం బండగానే సరారు కోటల్ కీ దాటి ఆడావాడూ వస్తాడ్. వొకటి భామ్మన్ బచ్చాచు,

తెస్తాడ్. మనవార్ మంసయందోచీ వారికీ పట్టీ తెచ్చాం సెప్పినార్ సాహెబ్.

బుస్సీ—వారిని శీఘ్రముగ ప్రవేశపెట్టుము.

దావా—చిత్తం చిత్తం. (నమస్కరించుచున్నాఁడు)

[అంతట చినవేంకటరావు నెత్తికొని దాసీలక్ష్మియు కొందఱు జవానులు ప్ర॥]

జవాన్—వీడికి హానుమానంసే పట్టి తెచ్చినాన్.

విజ—(పరికించి) ఈ కుమారుఁడు రంగారాయునికుమారుఁడనియు నిది మల్లమాదేవి దాసి యనియు నేనూహించితిని.

బుస్సీ—(దాసిందిలకించి) ఓసీ! ఈకుమారుఁ డెవరు? నీ వెక్కడికి వీనిం గొనిపోవుచుంటివి?

దాసి—(వడకుచు భయ మభినయించుచున్నది.)

హైదర—దొంగా ధగిడీ యిద్ది దీన్కి పట్టీ కొయ్యావాలా వుంచి.

విజ-మ. తళుకుంబంగరుజాలుఁడీ లిడెడుమేల్ ♦ దైవారు నెమ్మోమునన్
నెలనాముద్దులుమూటగట్టు మొగమున్ ♦ సిద్ధంపుచెక్కుల్ప్రచే
రలఁగొల్వంగదగువాలుగన్నులును దో♦రంబైన ప్రవేల్పైతులుం
గలయీపుత్రుఁడు రంగరాడ్విభునకున్ ♦ గాకేరికింబుట్టునే.

ఇతఁడు రంగారాయుని కుమారుఁడు వీని నిది రక్షించుటకుఁ గానటకో గొనిపోవుచున్నది.

బుస్సీ—ఓసీ నీకు భయము లేదు. నిజము చెప్పుము. నిన్ను రక్షించెదను.

దాసి—అయ్యో! నేను—(వడకుచు) మల్లమాదేవి దాసిని. నాపేరు వేంకటలక్ష్మి.

బుస్సీ—ఈ కుమారుఁ డెవ్వరు?

దాసి—ఈపిల్లవాఁడు ప్రా—రంగారాయ మహారాజ కుమారుఁడు. వీనిపేరు చినవేంకటరావు.

బుస్సీ—వీని నెటకుఁగొనిపోవుచుంటివి? బ్రాహ్మణవేష మేల వైచితివి?

దాసి—అయ్యా! నీవిని సంరక్షించుటకు సామర్లకోటకు గొని పోవుచుంటిని వీనిం బరాసులు పట్టుకొందురో యని భయంబునం జేసి

చ. ప్రకటముగాఁగ బాడబుల ♦ బాలుని వేషము వేసి దారిలో
బికిరము నెత్తికొంచుఁ గడు♦ భీతున మెట్టుచుఁ బోవుచుండగాఁ
నకటకటా! మొకంబులకు ♦ నై భయదం బగు కాఁడుకోనఁ జే
రుకొనఁగ నయ్యోదయ్యాపు గు ♦ రుల్ గడవంగ సమర్థుఁ డుందునే

గీ. మల్లమాదేవి దా నిట్లు ♦ మెల్లమెల్ల
బాలకుని గొంచుఁ బొమ్మని ♦ పంపె నన్ను
నేను సామర్లకోటలో ♦ వీనిఁ జేర్ప
వచ్చి యుంటిని నేమందు ♦ వ్రాతఫలము!

గీ. కోటలోపలి వారలు ♦ కూలిపోవ
బాలకుఁడు దిక్కు లేక తా ♦ గూలు నంచు
నెంచి యిటు సేయ నిట్లయ్యె? నేమి సేయు
దాన నెటు చొత్తు నింకేది ♦ యకాను దిక్కు.

బుస్సీ—కోటలోని వారందఱుం గూలుటయేమి?

దాసి—మ. అకటా! యేమని చెప్పుదానజగదీ♦శా! లక్ష సైన్యంబుపో
రికి రా భీకరవృత్తి నల్పబలులా ♦ రేచర్లవా రెట్లు సా
వక నిల్వంగల రిట్టిచో నగరిలో♦ వామాక్షులుల్ మానభం
గకరంబౌ నని వచ్చునంచుఁ దెగ సం♦కల్పించి రెల్లానొకో

బుస్సీ—కటకటా! కోటలో నాబాలగోపాలముగా స్త్రీ పురుష జనం బంతయును జాన నెంచి సాహసించియున్నదా? (విచారించుచు) విజయరామరాజా! నీ వెంత ఘోరకృత్యంబునకొడిగట్టితివి. బొబ్బిలి వారింత శౌర్యవంతులు మానవంతులు నని చెప్పవైతివిగదా? మనము చతురంగబలంబులతోఁ బోయిన వారు వచ్చి శరణుఁజొత్తురంటివిగాని

చత్తురని చెప్పక నన్ను మోసముచేసితీసికొని వచ్చితిని గదా ! ఇంక మన మేమి చేయవలసియున్నది ?

హైద—దుష్మాన్గుల్ వారికీ మీరు విచారం సెయ్యవాలా జరూర్ లేద్. లేకాపోతే వాహూవచ్చీ మనకీపాద్దనా సెయ్యకాపోర్. మన లచ్చం వారికీ లేద్. మనకీ సంపచాలా వున్నార్.

లక్ష్మ—ఈతండు చెప్పినట్లు వారు పరమదుర్మార్గులు, అందఱు మహారాజులువచ్చి మనదర్శనము చేసినారు. కాని వారు రాలేదుకదా!

క. ఎదిరించునట్టివారల
బెదరించి యడంగఁ ద్రొక్కి • విత్తవ్యాప్తిమై
గొదలంద జేసి కూల్చుట
పొదలినధర్మంబు గాదె • భువనేశులకున్.

కావునమనమిపుడు వారితో యుద్ధము చేసి వారినిసంహరించుట రాజ ధర్మంబుగాని ధర్మవిరుద్ధంబును పాపంబునుగాదు చిత్తగింపుము.

మ. కినుకన్ రాముఁడు రావణుం దునుమడే • కృష్ణుండు కంసాదులన్
దునుమన్ లేదె కిరీటి కుంభభవునిన్ • దూలింపఁడే ధర్మజుం
డును శల్యుం బరిమార్పఁడే గురుసుతుం • డుంగోయఁడే దాయలన్
మన మేపాటి మహాత్ము లెంద అరులన్ • మాయింపరే పోరులన్

విజ—వెలమవా రందఱకు నందు విశేషించి రావువారికి దురభిమానంబు మెండు. శౌర్యవంతుల మని కన్నుఁ గానక ప్రభువులపైఁ బ్రతిఘటించి యున్నవారు. వారి నెల్లరం ద్రెళ్ళ సేయుట యుత్తమంబ కాని యనుత్తమంబు కాదు మఱియును.

క. ఈషన్మాత్రుఁడ యైనన్
ద్వేషించినవానిఁ ద్రుంప • విహితము శత్రో
శ్శేషం న శేషయేత్తను
భాషణము విభూషణంబు • ప్రభువర్యులకున్.

కావున నీరంగారాయకుమారు నిపు డనుగ్రహించి పుచ్చితిమ యేని మన కెప్పటికైన వీనివలన ముప్పు రాకమానదు. దేవరయాజ్ఞ యేని వీని విషయ మాలోచించెదంగాక.

బుస్సీ—(ఆగ్రహముతో) ఓరి దురాత్మా! నీనాలిక చీలికగాను రాక్షసాధమా! నో రెఱుంగని పసిబాలుంజంప నీ నో రెట్లాడినదిరా! పశుప్రాయుఁడా! నీది బిడ్డలంగన్న కడుపు కాదురా! పాపాత్ముఁడా! ఈ కసుగందు నిన్నేమిచేసెనురా? క్రూరుఁడా! ఇట్లుపలికిన నిన్నేమి చేసెదనో చూడురా? (పరికించి) ఓహో! లాసూ—3

విజ—(భయ మభినయించుచున్నాఁడు)

హైద—హీవిజయరామరాజా పబువులాదమ్మం సెప్పీనాడ్ గాని దుసరా లేద్. కోపం సేయకా వీని రచ్చించావాలా పార్దనా సేస్తాఁ సలాం చేస్తాన్. రచ్చించా వాలా రచ్చించావాలా సర్కార్!

లక్ష్మ—క. ఋణశేష మగ్ని శేషము
రణ శేషము కూడ దనుచు ♦ రాజులధర్మం
బణుమాత్రమైనదానిం
గణియింపమిఁ గీడువచ్చుఁ ♦ గద లోకేశా.

దీనంజేసి మన విజయరామరా జిట్లు చెప్పెనుగాని—

సీ. పాలబుగ్గలవాని ♦ పసపునిగ్గులవాని
పున్నమనెలఁ బోలు ♦ మోమువాని
వాలుఁ గన్నులవాని ♦ వ్రేలు చేతులవాని
చుట్లువాఱిన లేత ♦ చుంచువాని
మొలక నవ్వులవానిఁ ♦ జిలుక కొల్కులవాని
డంబైన తొగరు గ ♦ డ్డంబువాని
ముద్దు గుల్కెడువాని ♦ ముచ్చటాడెడువాని
ముక్కుపచ్చలఁ దేరు ♦ మురుపు కాని

గీ. కాలు సేతులు గదలించి ♦ లీలనాడు
నట్టివానిని గనుపంతు ♦ నైనవానిఁ
జెలఁగు చిన్నారి పొన్నారి ♦ చిట్టివాని
వీనిఖలుఁ డైన జంపింపఁ ♦ బూను నోటు.

బుస్సీ—దానం జేసియా యిట్లుపలుకుట? కాని వీనిరక్షించుటయే పరమధర్మముగాని శిక్షించుటధర్మంబుగాదు. పాతకంబు కాకరంబు మన కీ చిఱుఁతవలన వచ్చు నపాయఁబును లేదు. వీసం జూచినప్పటి నుండియు నాహృదయంబుదయారసార్ద్రంబై పరితపించుచున్నయది.

విజ—మహాప్రభూ! నోరు రేని పిల్లవాఁ డితం డేమిచేయుననియా? ఇది పులిపిల్ల ఏమిచేయునో దేవరయే గ్రహింతురు గాక.

బుస్సీ—(శాంతించి) వీనిశౌర్య మెట్టిదో నాకిపుడు చూపఁగలవా?

విజ—చిత్తము. (కుమారుని చెంతకరిగి) బాబూ! నీ వెవ్వరిబిడ్డవు?

కుమా—నీ కే సెప్ప.

హైద—నీ పేర్సెప్పొ బేటా?

కుమా—నీకెందుకు సెప్పాలి? నువ్వేఁడు?

బుస్సీ—నాయనా! మీనాయనగారి పే రెవరు?

కుమా—నీ మంచి, నీకు సెప్తా దంగాడావుగాడ్.

అందఱు—(ఆశ్చర్య మభినయించుచున్నారు)

దాసి—(కుమారుం బొదువుకొని దుఃఖించుచున్నది.)

కుమా—లచ్చిమీ! యేదవకే యేదవకే నీకు బయ్యం లేదు. వీల్లం దల్నీ చితకొత్తేస్తాను. బయ్యంతే దేదవకే.

విజ—(నానాఫలములు, కజ్జాయములు, బొమ్మలు, సొమ్ములు, కత్తులు మొదలైనవి బల్లమీఁద నమరించి) కుమారా నీ కేమి కావలెనో దీసికొని భక్షింపుము.

కుమా—(మాఱుమోము వెట్టుచున్నాఁడు)

బుస్సీ—బిడ్డా! యిటువచ్చి యిందు నీకేమికావలెనో తీసికొని తినుము.

కుమా—(చంక దిగి యటు నడచి కత్తిపుచ్చుకొని యొరతీసి విజయరామునికై చూపి జడిపించి పండ్లు తెగనఱుకుచున్నాఁడు)

విజ—మహాప్రభూ! చిత్తగించారా! ఇది పులిపిల్ల కాని పిల్లిపిల్ల గాదు. మఱిరెండువర్షములు పైబడిన మనలఁ బింకిపెట్టక మానదు. కావున నామాట విని వీని నేనుఁగుకాల మట్టించుటకో పిరంగివాతం గట్టించుటకో ముదల యొసంగుము.

బుస్సీ—హాహాహాహా! మహాపాతకవర్తీ! పాపాత్ముఁడా! ఇట్టి లోకోత్తరగుణాస్పదుం డగు నిక్కమాకోత్తముని జంపుమని చెప్పుచుంటివి! నేను బాపాత్ముఁడనై నీమాట విని వీనిం దల్లిదండ్రులకుం బెడఁబాపితి నక్కటక్కటా! ఇంక నేనీ యుద్ధంబుమాని నీరాజ్య మంతయు శౌర్యనిధియగు రంగరాయనికొసంగి నాదేశంబునకు బోయెదంగాక, (క్రోధముతో లేచి) హైదరుజంగూ! అన్నము పున్నె మెఱుంగని పసిబాలుం జంపుమని పలుకు నీకిరాతునిం బిరంగి వాతం గట్టి ప్రేల్పింపుము. ముమ్మాటికి నాజ్ఞ యొసంగితి. వీని నా యెదుటినుండి తొలంగింపుము.

లక్ష్మ—

మ. అవధారో ప్రభువర్య! ఘోరసమరం ♦ బొనిష్పు డిట్లాగ్రహం
బవునే? నీకితఁ డుత్తమోత్తముఁడుగా ♦ కజ్ఞానుఁడే క్రూరుఁడే
సవిమర్శంబుగ రాజధర్మమున నీ ♦ చందంబునం బల్కెనాఁ
డపమార్గంబుగ బట్టలే దితని ని ♦ ట్టాడంగ న్యాయ్యం బటే.

చ. శరణము నొంది దీనుఁడను ♦ సాకు మటంచును వేఁడ నీతనిం
గరుణ దలిర్పఁగా నభయ ♦ కల్పితదాన మొసంగి ప్రోచియుఁ

పగతుండ వైన నీవొక ♦ నెపంబునఁ జేసి వధింప నెంచుటల్
గురుతర పాతకం బితనిఁ గోపము దీర ననుగ్రహింపవే.

విజ - (బుస్సీ దిక్కు మొగంబై)

మ. అపరాధం బొనరించినాఁడ నరిశే ♦ షాపేక్షనిశ్శాలునిక్
కృపలే కజ్ఞుఁడనై వధింపు మనుచున్ ♦ నీవోక్తులం బల్కఁగిక్
విపరీతంబయి ప్రాణగొడ్డ మగుచున్ ♦ వింతల్ జనించెం గటా
కృపతో నన్ను ననుగ్రహింపు మికఁ దండ్రీ! తప్పు సైరించుచున్

హైద — రాజాకా తప్పు లేద్. మెహర్బానీ రఖ్ఖోసర్కార్!

బుస్సీ — మీ రందఱు నింతగాఁ జెప్పుచున్నారు గావున నితని గటాక్షించితి. రాజా! నీవింక బుద్ధిగలిగి మెలంగుము. సేనానాయకులారా! మీరీకుమారుం దీసికొనిపోయి నాపటకుటీరంబున సంరక్షింపుడు. (అని కుమారుం బాదవి తొడపైఁ గూరుచుండం బెట్టుకొని ముద్దులాడి కుమారా! నీ కేమి కావలెను? కజాయంబు వెట్టింతునా? తండ్రీ!

కుమా — ఊహుఁ! (విజయరాముఁ జూపి) వీన్ని కొత్తాలి కత్తియ్యి.

అందఱు — (ఆశ్చర్య మభినయించుచున్నారు)

బుస్సీ — తండ్రీ! నీవీ దాసితో నాయింటికి వెళ్ళి సుఖంబుగా నుండుము. నే నిదె వచ్చి నీకన్నియు నిచ్చెదను. (దాసి కందిచ్చును)

(తెరలోఁ గలకలము)

హైద — బడాయుద్ధం జరుగుతాదీ ఫ్రుద మాకీ పోవాలా హుకుం దేవ్.

బుస్సీ — సరే! మీరందఱు బోవచ్చును.

బుస్సీ — (తనలో) హైదరును విజయరాముఁడును నన్ను మోసము చేసినమాట నిజము. బొబ్బిలిరాజులు, నిర్దోషులు, అభిమానధనులు. వారి ప్రమందించుట మహాఘాతకము, పోరాటంబుమాని వారిరాజ్యము

వారి కిచ్చి పోవుదునా? (ఆలోచించి) ఇంతకు వచ్చిన తరువాత నేను వెనుకదీయుట పాఁడి కాదు. నన్నెల్లరును పిఱికివాఁ డందురు. కానీ! కానున్నది కాకమానదు (ప్రకాశముగా) లక్ష్మన్నా! యుద్ధ మెట్లగుచున్నది?

లక్ష్మ—(చూచి) దేవా!

మ. అదిగో చూడుము కోటకొత్తడమునన్ ♦ హసాసప్పబారిజెత్తోఁ
బదివేలేన్గుల శక్తిగల్గినటు ద♦ర్పంబొప్ప వర్తించు నా
చమురుండే సుమి రంగరాయ విభుఁడా ♦ చక్కిన్ మహాశౌర్య సం
పదతోఁ నిల్చిన యోధులే తెలియ ధ♦ర్మారాయముఖ్యుల్ ప్రభూ!

బుస్సీ—ఆహా! రంగరాయఁడు శౌర్యమెల్ల మూర్తీభవించినట్లు కన్పట్టుచున్నాఁడు. వీనిదర్శనంబునం జేసి నాకన్ను పండువయైనది (పరికించి) ఓహో! మన సేనలు పాఱుచున్నవేమి?

లక్ష్మ—

మ. నరసారాయఁడు ధర్మరాయఁడును జి ♦ న్నారాయఁడుం దొట్టిపో
టరు లెల్లం జెల రేగి తెంపు మెయిఁ గో ♦ టన్ వీడి పైవచ్చి మేల్
కరవాలంబులు నీటెలున్ సురియలున్ ♦ గైకొంచుఁ బోరంగ హై
దరు ముఖ్యుల్ వెఱగందిపాఱెదర దే ♦ ధైర్యంబు వోనాఁడుచున్.

బుస్సీ—ఛీ ఛీ! మనసేన కాలినట్టే యున్నది. అదిగో హైదరు జంగు విజయరామునితో నేమో ఘోషించుచున్నాఁడు విను.

లక్ష్మ—హైదరుజంగు సైన్యమంతయుం జెల్లాచెదరై తాను దెబ్బలు తినియున్నవాఁ డగుటంజేసి విజయరాముని నిట్లు పలుకుచున్నాఁడు.

ఉ. ఎందఱో మన్నెగాండ్రు గల ♦ రెందఱో వీరులు శూరులుండి రే
నందఱికన్న మిన్నగ మ ♦ హాహవమందు బ్రశక్తికెక్కెదన్
ముందఱఁ జూడుమంచుఁ బలు ♦ ముచ్చటలాడితి పప్పు డిప్పు డీ
క్రందన నంతయు న్మఱచి ♦ కాల్గొలదిం బరువెత్తుచుంటివే.

ఉ. మాయలు కొన్ని పన్ని మఱి ♦ మ్రాన్పడఁ జేసి దురం బొనర్పన
న్నాయిత పెట్టి పాపమున ♦ యందు బడల్ పడఁజేసి నీచుఁడా!
రాయల గొంపఁ దీయుటకు ♦ రాజ నటంచును విఱ్ఱవీఁగు నీ
వీయెడఁ బాఱి పోఁ దగునె ♦ హీనము గాదె కులంబునీతికిన్.

విజ—(పాడకట్టి)

ఉ. ప్రాణము తీపుగాదె యొఱు ♦ వంటి పరాక్రమ శాలికైన నా
రాణువ యంతయుం దెగియె ♦ రాజ పరాక్రమ విక్రమంబునన్
ద్రోణుఁడు వోలెఁ దెంపుమెయిఁ ♦ ద్రోపడఁ జేయుచువచ్చుచుండెగం
ఖాణము లేన్గులుం దెరలెఁ ♦ గాల్బలఁదిల బరువెత్త కెట్లగున్

బుస్సీ—విజయరాముని పరాక్రమం బింతటిదియా! చాలుచాలు. రంగరాయఁ డేమో పలుకుచున్నాఁడు. సద్దుచేయకుము.

రంగా—(పాడకట్టి)

చ. నిలు నిలు నీచరాజ! నను ♦ నీ బలగంబును బిండిపిండిగా
నలిపెదఁ గాళ్ళఁ జేతులను ♦ నాబలమెల్ల జనుల్ నుతింపగా
వెల లెద వేలసంగరము ♦ పెల్లభిమానము వీటబుచ్చి బ
చ్చులకడఁ జేరి యిచ్చకము ♦ జూపుట గాదిది విచ్చుకత్తిరా.

లక్ష్మ—దేవా! నరసరాయ డేమో విజయరాముం దిరస్కరించి పలుకుచున్నాఁ డాకర్ణింపుము,

నర—ఆ. ఓరి విజయరామ ♦ పాఱె దేలరమాట
లాడి నల్లై యనుచు ♦ నైతి వేమొ
గంపసిరులు గావు ♦ గాలంబు సిరు లివి
చక్కనిలుము నిన్ను ♦ నుక్కడంతు

బుస్సీ—ధర్మారావు హైదరు దిక్కు తిరిగి నా డది విను.

ధర్మా—(పాడకట్టి)

చ. తులువ కళింగ రాజునకుఁ ♦ దోడ్పడి న న్నపు డీవుపట్టుకోఁ
దలఁచియనార్యపున్ నలుపు ♦ దారిదొలంగితి వేమి యయ్యానిన్

బిఱుకుఱఁ జేసెదం బరక ♦ బిడ్డవయేని భయంబుఁ దక్కి నా
కెలన నెదుర్పు మిడ్డు పస ♦ కేరిన హైదరుజంగు సాహెబూ!

బుస్సీ—చూచితివా సేనలన్నియుమఱలఁ బురికొనిమహాయుద్ధంబు సేయుచున్నవి?

(తెరలో మహాకలకలము)

లక్ష్మ—హాహా! మహాప్రభూ! కంటిరా?

శా. ఘోరంబయ్యెదిరంగరాయుఁడును బో♦కుంగూర్చులాల్ఖానుదుర్
హోరాహోరి బెనంగిశస్త్రములతో♦నుక్కెక్కి తారొండొరుల్
బారిశెల్ గొని వైచికొందు ధరణీ♦భాగంబునం గూలి రా
హారావం బుదయింప నొక్కపరి యో♦ధాగ్రేసరుల్ భీతిలన్.

బుస్సీ—హాహా! రంగరాయమహారాజ! భూమండలాఖండలుండ వన నొప్పునిన్ను నే మూర్ఖుండనై నిధనంబు నొందించితినిగదా! నే నెంత పాపాత్ముఁడను! నీ వెంత పుణ్యాత్ముఁడవు! మమ్మీమ్లేచ్ఛలోకంబునం బడవైచి నీవు వీరస్వర్గ మనుభవింప నేగుచుంటివా? పుణ్యరాశీ! మీరెంత పుణ్యవంతులో మీ కాంతలు గూడ నంత పుణ్యవతులే. వారి చావునకును నేనే కారణం బయితిని గదా! హాహాహా (విచారించును)

తెరలో మఱలఁ గలకలము)

లక్ష్మ—అయ్యా! చూడు మదిగో మహాక్రోధముతో నభిమన్యు ననుకరించి వెంగళరాయఁడు సపరివారంబుగా హైదరుజంగు దిక్కు మొగంబై వచ్చుచున్నాఁడు.

బుస్సీ—ఏదారి నెట్లు వచ్చుచున్నాఁడు?

లక్ష్మ—పశ్చద్వారమునుండి కోటవెలుపలకు వచ్చి తన్నుఁ జంపఁ బొంచియున్న చిన్నబిలాలు నొక్కయేటున రెండుతుండెములుగా నఱికి పండ్రెండువేల మందిని బటాపంచలుగావించి గవ్యూతిదూరంబు పాఱఁ దోలినాఁడు.

బుస్సీ—ఆహా! వెంగళరావు పరాక్రమము! వేయిమందితో నన్ని వేలం దూలంపుచ్చినాఁడా? తరువాత?

లక్ష్మ—మఱలి వచ్చినపుడు పొంచియుండి విజయరామరాజా వేగుర మోసంబున నాశనంబు చేసినాఁడు

బుస్సీ—చీచీ! విజయరాముఁ డెట్లుచేసినాఁడు! పరాక్రమమున్న యెడల నెదుటఁబడి పోరరాఁడా? తరువాత?

లక్ష్మ—అందు వెంగళరాయ ప్రభృతులు పంద్రెండుగురుమాత్రము మిగిలిరి. వారే మఱికొందఱం గూడికొని తోఁక ద్రొక్కిన త్రాచుల వలె నాలుకలుగోయుచు విజయరామ సైన్యంబు దైన్యంబు నొందించి యిట వచ్చుచున్నారు.

[చెప్పినట్లు వేంగళరాయాదులు ప్రవేశింతురు]

వెంగ—ఓరోరి విజయరామ! ఓరి హైదర

ఉ. పాపులు పాపరూపమునఁ ♦ బాల్పడి బుస్సికి బోధచేసి మీ
రీపగిదిం దురంబునకు ♦ నీబలగంబుల నెల్లఁ దెచ్చి మా
పాపలఁ గ్రేపులం గోలము ♦ వారల నెల్లరఁ గూల్చనెంచిరా
మీపసపట్టెదర్ మగంటి ♦ ఖుణ్ నిలుఁ డిప్పుడు నేను వచ్చితిన్.

ఉ. మోసముచేసి లాలు నర ♦ పుంగవు రంగ మహీంకళత్రుఁ జా
నేసెను దానఁ దీఱు నని ♦ యెల్ల నటంచును గర్వితాత్ములై
యోసరఁబోకుఁ నీ వెలమ ♦ యోధులు కుత్తుకఁ బ్రాణముండగా
పీసము తీసిపోరు మిము ♦ పీసరు పుత్తురుగాని వ్రేల్మిడిన్.

హై—(పాఱిపోవుచు విజయరాముం డగ్గఱి) నాకి పానసంకటం వచ్చిందీవుంది నికీ నమ్మా నేన్ పిల్లల్కీ మేకల్కీ సెడ్డాన్. నీవుబహా లమ్కర్ కలవాఁడూ మాటనమ్మేన్. ఇంకా నానసీబ్ చెడ్డాదివుంది నాకీ నూకల్ సెల్లిపోయింది. సావూ రాసిందీ నిజం! గ్రహచ్చారం యేమి సెప్పవాలా రాజా (పాఱిపోవుచున్నాఁడు)

(తెఱలోఁ గలకలము)

బుస్సీ — మన సేనలు మరల వెనుకకొనుచున్నవి, చూడుము.

లక్ష్మ — చిత్తము. వేంగళరాయఁడు వెన్నంటి వచ్చుచో హైదరాడిన మాటల కభిమానంబు వొడమి విజయరాముఁ డెదురుకొనియె. అప్పు డెల్ల సేనలు విరుగఁబడినవి.

బుస్సీ — అరేరే! అదిగో వెంగళ్రాయఁ డెల్లర నల్లుల నలిపినట్లు నలిపి సింగంబు లేళ్ళందోలినట్లు తోలుచున్నాఁడు హాహా! వెంగళ్రాయని శౌర్య మనివార్యముగదా!

లక్ష్మ — సందేహమా? ప్రభువరా!

మ. కలనం బాపయలేకుగా నకఁడు వేం ♦ గళ్రాయఁడుం గూడినన్
కలశాబ్ధి న్మథియించు మంథరమునాఁ ♦ గల్లోలముం జేసి నీ
బలమెల్లన్ నశియించి పో సమరమున్ ♦ వర్తింపఁగా జేయరే
నెలమల్ ధైర్యహిమాద్రులందుఁ బ్రబలుల్ ♦ నీ రెన్నలోకేశ్వరా

బుస్సీ — వీఁ డెవఁడు కొండం దగఱువోలె వెంగళ్రాయనిం ఢీకొనుచున్నాఁడు?

లక్ష్మ — వాఁడే సిద్దీబిల్, దేవా! చిత్తగింపు మెట్టి ఘోరయుద్ధమగుచున్నదో! ఇరువాగులం బోరుచుండునపుడు వెంగళ్రావుపోటులు బిలాలు లాటీతోను బిలాలునఱకులు వెంగళ్రావు డాలుతోను గాచుకొనుచు నందఱకు మెప్పు పుట్టించుచున్నారు. ఇప్పుడు బిలా లిట్లు పలుకుచున్నాఁడు విను.

"శా. ఎన్నో కోటలు ముట్టడించితిమి మే ♦ మెన్నో మహారాష్ట్రముల్
విన్నాణంబుగఁ గొంటి మెన్నొ దురముల్ ♦ లీలాగతిం గంటిమీ
సన్నాహంబును శౌర్య మొందుఁగన మ ♦ జ్జా వేంగళాధీశ్వరా
నిన్నుం జూచిన గుండె బ్రద్దలగుచుం ♦ డెన్నాకు, వే యేటికిన్.

లక్ష్మ — హరహర! ఎంత ఘోరకృత్యము జరిగినదో చూచితివా మహాప్రభూ! బిలా లిట్లగ్గించుచుఁ బరాయత్తచిత్తుండై యున్నతఱి వెంగళ్రాయు నొకవ్రేటు వ్రేసినాఁడు, దాన నతని చెంప తెగిపడినది.

బుస్సీ — చీచీ! బిలా లెట్టి పని చేసినాఁడు?

లక్ష్మ—ఆ వింతచూడు తెగిపడిన చెంపకుఁగట్టుకట్టించుకొని వెంగళ్రావు వానిమీఁద కెట్టుటికి పలుకుచున్నాఁడో చూడుము.

వెంగ—(కనుపడి) ఓకోరీ గుర్మార్గుఁడా!

మ. నను నగ్గించుచు నేఁ బరాకు వడియుం ♦ డం జొపయూడంగజో
రుని చందంబునఁ గత్తిని న్విసరితో ♦ రోరీ! మనుష్యాధమా
నిను వీ రెల్లరుఁ జూచుచుండ నిదిగోఁ ♦ నే నీ కృపాణంబునం
దను వింతింతలు చేసి కూల్తు క్షణమా ♦ త్రం జాలినం గాచుకో.

(కత్తిదూసికొని పఱచుచున్నాఁడు. తెరలో! బెద్దకలకలము)

బుస్సీ—లక్ష్మణా! సిద్దీబలాలు పనియైనట్లున్నదే అయ్యో! మన సేన కెంత విపత్తు వచ్చినది?

లక్ష్మ—దేవా! ఒక్క సిద్దిబిలాలు కూలుటయే కాదు. వెంగళ్రాయని ప్రేటులకు మన సైన్యంబాతయు దైన్యంబునొందె జంద్రాల్ జాసూఖాన్ ప్రభృతి ప్రధానయోధులు నిధనంబు నొందిరి. హైదరు జంగు ప్రాణావశిష్టుండై పడియె విజయరామరాజుచావు దెబ్బలు తిని పాఱినాఁడు. మనవారి దెబ్బలకు బొబ్బిలియోధు లెల్లరును బ్రాణంబులు గోలుపోయిరి, అదిగో బిలాలు కొట్టినదెబ్బ భరింపలేక వెంగళ్రాయఁడును బడియున్నవాఁడు.

బుస్సీ—హాహా! యెంతఘోరకృత్యము సంభవించినది! లక్ష్మణా మన మటకుఁ బోవుదము లెమ్ము. (లేచి కొంచెము నిష్క్రమించుచున్నారు.) (అపటిక్షేపంబునఁ బూర్వోక్తక్రమంబున హైదరును వెంగళ్రాయండును గనుపడుచున్నారు.)

విజ—(వినమ్రుఁడై సమీపించుచున్నాఁడు)

బుస్సీ—(వెంగళ్రాయని చెంత కరిగి) హాహా! మహారాజా! నేను మూసాబూసిని. నిన్నుఁ జూడ వచ్చితిని నన్నుఁ గన్నెత్తిచూడుము.

వెంగ—(చూచి సంజ్ఞగా సలాము తెల్పుచున్నాఁడు)

బుస్సీ—వెంగళరాయా! నీపరాక్రమం బగ్గింప శక్రాదులకును శక్యంబుగాదు. హాహా! ఒకచెంత తెగియు నీ వెట్టి విక్రమంబు గావించితివి; నీయున్న రంగారాయఁడు మహాపౌరుషవంతుఁడు. హైదరు

దుర్బోధనంబునం జేసి మిమ్మిట్లు చేసి దోషంబు గట్టుకొంటి. కడచిన దాని కిపుడు చింతించిన ప్రయోజనంబు లేదు. నీవు చింతించకుము. నిన్ను నా చెంత బెట్టుకొని వ్రణౌషధంబు వేసి సంరక్షించెద. భయం బుడుగుము (హైదరు చెంతకరిగి) హైదరుజంగా! నీకెంతయు నవస్థపట్టినది దీని కంతకును గారణ మీవే కదా! నీవీపాపాత్ముఁడగు విజయరాముని మాట విని యింత తెచ్చితివి. బొబ్బిలివారితో మనకుఁ గలహంబు వలదని చెప్పిన గోదుందొరమాట విననీయక పండువంటి బొబ్బిలి వారి సంసారం బంతయుఁ బాడుచేయించితివి. పాపం బంతయు నీవును విజయరామరాజునుం బొందెదరుగాక. (విజయరాముంజూచి) రాజాధమా! స్త్రీ బాల వృద్ధసమేతంబుగా నిష్కారణ మిన్ని వేల మందిని జంపించితిగదా! స్త్రీజనంబు చిచ్చుపెట్టుకొని చచ్చునప్పుడు కోటలో మంట లేమని పిన్నడిగిన పెండ్లి వేడుక లని యెన్నో వారి నేరంబు లుగ్గడించితివి గదా! మము బోంట్లు నిన్నుం జూచి నీతోఁ బ్రసంగించిన మహాపాతకంబు చుట్టుకొనును అట్లని యిప్పుడు నేఁ జేయవలసిన దేమియును లేదు గావునఁ బీనుఁగు పెంటయైన కోటం జూడఁబోవుదము పరిశుద్ధంబు చేయింపుము.

విజ—(తనలో) ఇప్పటికి నాకుఁ జావు బ్రదుకులమీఁద బొబ్బిలి కోటలోఁ బ్రవేశించు భాగ్యంబు పట్టినది. (ప్రకాశముగా) దేవర వారి యాజ్ఞప్రకారము గావించెద.

బుస్సీ—లక్ష్మణా! పెంగళరాయని హైదరుజంగుని బటకుటీ రంబుకు చేర్పింపుము. (తెరలో)

చ. జగమున కెల్లఁ జుట్టమును ♦ జక్షువునై కనిపెంచు భాస్కరుం
డగముల పాలుచేసి తను ♦ జాంశుల తేజము దూలిపో ఘనం
బగుతమ మావరించుకొన ♦ నారసి లోపము దీర్ప దర్పమొ
ప్పగ వగమై కళానిధియు ♦ వచ్చెడు నాఁబొడకట్టు నియ్యెడన్.

బుస్సీ-సాయంకాలమగుట వినబడుచున్నది. విడిదలకుం బోదమా

లక్ష్మణ-చిత్తము. (బుస్సీతో లేచుచున్నాఁడు) (తెరపడుచున్నది)

———

# బొబ్బిలి యుద్ధము

## షష్ఠాంకము

స్థలము : రాజాము నందలి రాజభవనము

[అంత గోసారామునితోఁ దాండ్రపాపయ్య ప్రవేశించుచున్నాఁడు]

పాప—రామా! నేఁ డేమో నామనం బాందోళనంబు నొందు చున్నయది. కారణ మేమైయుండును?

చ. అడుగులు దిన్నయట్లు మది ♦ నారట మెచ్చెను గుండెజల్లుమం
చడరెడుఁ జల్ల చిల్కినటు ♦ లయ్యెడు లోఁ దిగులెచ్చి యున్నచో
గడుకొని యుంటకున్ హితవు ♦ గాదెదిలోపను తాప మంగకం
బుడుకఁగ జేయు మిన్నిటులు ♦ నోయసి బీతగు నాకు నిత్తఱిన్,

పరాసులు మాఱుదారిం దేవులపల్లి జేరినట్లిప్పుడే పవనవగాఁ దెలియ వచ్చినది. దుష్టాత్ములు వారేమేమి కష్టకార్యములు చేసియుండిరో గదా? నాకెంగమాత్ర మిపుడు బొబ్బిలియంతయుం దెగె నన్నంత వఱకున్నది. దీని కేమికారణంబై యుండునో తెలియరాదు.

రాము—మహారాజ! వేయికన్నులతోఁ నీవు చూచి రక్షించు చుండ బొబ్బిలిపై నీగయైన వ్రాలజాలునా? పరాసులు దేవులపల్లి వెళ్ళినను మళ్ళి రావలసినదే కాని మనయోధుల నేమి చేయగలరు? ఇప్పుడు నీకింత చిత్తవికారమ్మునకుఁ గారణమ్ము లేదు. ఉపశమించి వేగులవారింబుచ్చి వారు దేవులపల్లి వచ్చుటంగూర్చి నిశ్చయంబు లెఱింగి పిమ్మట కార్యంబు దెసం బ్రవర్తించుటుచితం బని నాయభిప్రాయము,

పాపా—సరే! నీవు చెప్పినది మంచిపద్ధతియే. అట్లుచేయుదము గాక. (విని) హజారమునకడ సందడి యేమో చూడుము.

రాము—చిత్తము (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) రాజా! మన భీముఁడు వచ్చి హజారముకడ వేచియున్నాఁడు.

పాపా—వాని శీఘ్రముగఁ బ్రవేశ పెట్టుము.

రాము—(నిష్క్రమించి భీమునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

భీము—(దుఃఖముతో పరుగెత్తుచు) అయ్యో! అయ్యో!

పాపా—ఏమిరా! అది? అట్లుబెగడొందుచుంటివేమి? నీకాయమునం గాయము లగపడుచున్నవి. పరాసులు నిన్నుఁబ్రహరించిరా యేమి? వారెక్కడకు వచ్చినా రెక్కడ నున్నారు?

భీము—అయ్యో! బాబయ్యా! అంతయుం బోయినది?

పాపా—ఆఁ! ఆఁ! ఏమిరా అది!

భీము—విజయనగరరాజు పరాసులను మాఱుదారిందెచ్చి కోట ముట్టడించి, అందఱను హతము చేసినాఁడు బాబూ! చావుతప్పించుకొని యేలాగో బైటఁబడి నేను మీతో మనవిచేసికోవచ్చినాఁడ

పాపా—హాహాహాహా! పరమేశ్వరా! (పడిమూర్ఛిల్లుచున్నాఁడు)

రాము—(దుఃఖించుచు సేద దేర్చుచున్నాఁడు.)

పాపా—(సేదదేరి లేచి కన్నీళ్ళతో) అందఱను హతము చేసినాఁడంటి వేమిరా? అది ఎట్లయ్యినది? ఏమి వృత్తాంతము?

భీము—బాబూ! పరాసులు వచ్చి మూఁగినతోడనే మనదొరగారెన్నో రాయబారము లంపినారు. దానికి వా రంగీకరింపక యుద్ధము చేసినారు. అందఱి ప్రాణములు పోయినవి.

పాపా—హాహా! పరమేశ్వరా! (పడిమూర్ఛిల్లుచున్నాఁడు.)

రాము—బాబూ! దుఃఖించిన ఫలము లేదు. మీయట్టి పురుషాగ్రగణ్యుల కిట్లుండఁదగదు. లెమ్ము లెమ్ము. కార్యమాలోచింపుము.

పాపా—(లేచి దుఃఖముతో) మన రంగారాయప్రభృతులందఱు గాలధర్మము నొందినారా ?

భీము—బాబూ! అందఱును.

శా. హాహా! సద్గుణమూర్తి! సర్వనుతశౌ ♦ ర్యస్ఫూర్తి! రంగాధిపా
బాహాబాహిఁ బెనంగి నీ వరులఁగ ♦ ర్వంబెల్ల మాయింతు వా
ద్రోహుల్ నిన్నును మోసబుచ్చి కలనం ♦ దూలించిరే నీకునుర్వీ
దేహంబున్ విడుపాటు వచ్చె నకటా! ♦ దీనుండనై పోయితే.

చ. తొరపడఁగూడ దెందు నని ♦ తొల్లి మునున్ వచియింతువట్టినీ
వరులను శాంతిఁ జేసికొను ♦ నట్టివిధంబునఁ బుట్టకీసునం
దుర మొనరింప నేల నను ♦ దోడుగఁ బిల్వవదేటి కయ్యయో
ధరఁ బెడఁబాసి స్వర్గపురి దా ♦ రిసి బట్టితె రంగభూపతీ.

సీ. నీశౌర్యధైర్యముల్ ♦ నీ ప్రభావంబును
మంటిపాలయ్యెనే ♦ మానవేంద్ర
నీదుగాంభీర్యంబు ♦ నీదుశౌర్యంబును
బూదెపాలయ్యెనే ♦ పుణ్యమూర్తి!
నీసద్గుణంబులు ♦ నీయోగ్యవర్తనం
బడవిపాలయ్యెనే ♦ యనఘకీర్తి
నీ సాహసంబును ♦ నీశరీరంబును
జమునిపాలయ్యెనే ♦ చక్రవర్తి!
గీ. కటకటా! సర్వజననాశ ♦ కాల మిపుడు
వచ్చియున్నది గాఁబోలు ♦ వసుమతీశ!
కాక యుండిన నిట్లేల ♦ కలను హెచ్చు
నేను బెడబాసి యుండు ♦ టిదేల వచ్చు.

ఓరీ! సర్వజన నాశనమైన దని చెప్పుచుంటి వంతఃపురాంగన లెట్లున్నవారు? వారి కవమానంబు వాటిల్లలేదుకదా?

భీము— లేదయా లేదు దొంగావ! వారి నందఱను జెలకాని వెంకయ్యగారిచే నఱకించినారు. మల్లమాదేవి తనంతఁ దా నఱకు కొని ప్రాణత్యాగము చేసికొనియె. దాదులుం జావనెంచినవారిని జిచ్చువెట్టి కాల్చివేసినారు దేవా?

పాపా—హాహా! నాసహోదరీ! మల్లమాంబా! హాహాహాహా

(పడి మూర్ఛిల్లుచున్నాఁడు)

రాము—రాజా! శాంతింపుము శాంతింపుము (సేవదేర్చుచున్నాడు)

పాపా—(సేదదేరి కన్నీళ్ళతో) అమ్మా! మల్లమాంబా!

సీ. అనదవై చాలఁ దపియింప ♦ వైతివమ్మ
మానహానికి శంకించి ♦ మడిసితమ్మ
కొడుకుగతి యేమిగాఁ జేసి ♦ నడిచితమ్మ
మల్లమాదేవి! నన్నుఁ గన్న ♦ తల్లి! నీవు.

అయ్యో! నాప్రియసహోదరీ!

చ. ఒక దెస నేను గన్పడక ♦ యుండినఁ దమ్ముడ! పాపరాయఁడా
సుతముగ నుంటె వయ్య! నను ♦ జూడగ రావది యేమి భావతో
నెకసకియంబులా యనుచు ♦ నెప్పుడు నన్ను దయార్ద్రదృష్టి వీ
డక కనుచుండు తల్లి వక ♦ టా! దివికేగితె మల్లమాంబికా!

ఓరీ! సేవకా! ఇంతపని జరుగునప్పుడు నాకేలవార్త నంపలేదురా?

భీము—బాబూ! పంపినారు. వార్తాహరు లాడువేషములు వైచి కొని వచ్చుచుండగా విజయరాముఁడు వారిం బట్టుకొని శిక్షించినాఁడు సామి!

పాపా—అన్నా! ఎంతపనిజరిగినది! ఎంతపనిజరిగినది! దుర్మార్గుఁ డట్లు చేసినాఁడా? కానీ కుమారునిసంగతి యే మైనదిరా?

భీము—ఆ దొరబిడ్డకు బాపన వేషము వేసి దాసీలక్ష్మితో సామర్ల కోట కంపుచుండఁగా బుస్సీ పట్టుకొని తనయింటం బెట్టుకొని రక్షించు చున్నాఁడు.

పాపా—అమ్మయ్య! వంశాంకురంబు వాఁడైన జీవించియుండెనని విన్న నామది కింత నెమ్మది గలిగినది. పట్టుకొని రనునంతలో చంపి రని చెప్పుదువేమో యనుకొంటిసిరా సేవకా!

భీము—అంతపనియు జరిగెడిదే. విజయరాముఁడా బాలు నేనుఁగు కాల మట్టింతు ననెం గాని బుస్సీ దాని కంగీకరింప లేదుసామి.

పాపా—హాహా! మూసాబూసీ!

చ. కలుకులంబునం బొడమి ♦ కష్టుఁడవయ్యెను దుష్ట రాజుకున్
గలుపులఁ గ్రాగుచిత్తమునఁ ♦ గ్రాలెడువాఁడవ యయ్యెఁగయ్యపుం
గలకటివయ్యె శత్రుసుతుఁ ♦ గట్టడఁ బట్టియుఁ జంప నిష్టముం
దొలయవు నీదునర్మిలిక ♦ నుంగొన సంస్తవనీయ మయ్యెడున్.

ఓరిదుష్టాత్ముఁడా! విజయరామ!

మ. కడుపా నీయది ఖండవల్లిమడుగా ♦ గంద్రాలనుం గంటివా
కొడుకు ల్లేరుర నీకు రాకొమరునిన్ ♦ గోయింపఁగా నెంతువా
జడబుద్ధీ పర మాపకారి వగు నిన్ ♦ జర్చింప కావంతయుం
గడిమిం నే నిదె కండకండలుగ నీ ♦ కాయంబు ఖండింపనే.

సేవకా! మన వెంగళ్రాయునిమాట చెప్పవేమి?

భీము—దొరా! ఆ దొరగారు తన తలసాము దెగినను దాను చెలికాని వెంకయ్య దామెర దమ్మన్న మొదలగు యోధులతో నన్నో వేలం గూలనేసి హైదరుజాగుం బడఁగొట్టి సిద్దీబిలాలుతోఁ బోరి వాని జంపి తాను పడినాఁడు. అప్పు డా విజయరాముఁ డా దొరకడకు వచ్చి నీవా రందఱుఁ బోవ నీ వేల బ్రతికినావని వేళా కోళము చేసినాడంట. అపుడు పడియున్న చిన్నదొర కోపముతో నేఁ బడినను నా బావ నిన్నుఁ బడవేయు నని చెప్పినాడఁట బాబూ!

పాపా—హాహా! వెంగళ్రాయా! నీశౌర్య మనివార్యము గదా!

చ. తల నగ మూడినన్ మఱల ♦ దానిని గట్టిగఁ గట్టి లాలునుం
బిలుకుగఁ జేసి హైదరుని ♦ పీచ మడంచి కళింగరాజుఁ గా
ల్గోలఁదిని బాఱఁజేసి మును ♦ కొన్ని బలంబుల వేనవేలభూ
తలముల బాఁడఁబెట్టి శ్రమ ♦ దార్కొని మూర్ఛమునింగితే కటా!

క. నాతోడు గలుగు నని నం
జాతటి నీ వెంత లోన ♦ నాసం బడితో
నాతండ్రి! నీవు బడలితి
వో! తగ నే నుండి లేక ♦ పోయితి నీకున్.

మ. నిను నాబావ వధించు నేఁ బడిన గా ♦ నీయంచు నారామరా
జును నోనాడి వచించితట్టి మఱిఁదీ! ♦ చుట్టాలునున్ నెయ్యురున్
మనుజేంద్రుండును నీవు నెల్లప్రజలున్ ♦ వమ్మైనచో వాని గూ
ల్చిన లాభం బది యేమి సంతసిలువా ♦ న్లేనప్పు డీ భూస్థలిన్.

అయ్యో! సేవకా! వేదనాభరంబున నతండీపాటికిపరలోకమునకుం బోయియే యుండును. అవురా! విజయరాముఁ డెంతపని చేసినాఁడు! బుస్సిం దన మాయలోఁ బడవేసికొనియెంగదా!

భీము—వాఁడు చేసినకీ డింతింత యనిచెప్ప శక్యమా?

పాపా—రామా! ఇంక మనకుఁ గర్తవ్యమేమి?

రాము—దేవా! నీవు వచ్చి విజయరాముం జంపుదు వని మన వెంగళ్రాయుఁడు గంపెడంతాస వెట్టుకొని యుండెగదా! వాని మనోరథంబు తీర్చుటయే మనకుం గర్తవ్యము.

పాపా—ఛీఛీ! సర్వబంధుజన నాశనం బై యున్నయప్పుడు వాఁ డెట్టివాఁడైనఁ జంపిన నేమిప్రయోజనము?

క. శూరుడు పాపారాయఁడు, వీరుఁడు నామేనమఱది ♦ విచ్చేసితటిన్
వైరుల జంపెననుచు రం, గారాయఁడు సంతసింప ♦ గా లేడుగదా.

ఇట్టిచో నట్టిప్రయత్నము చేయుటకన్న దన్యోపాయమును లేదు. కావున మన మిపుడు కాశీప్రయాణము చేయుదము లెండు.

రాము—మన కిపు డాప్రయాణ మంతపోలియుండదు. రాజులకు శత్రుక్షయంబు చేసి ఘోరసం దీఱుటయే యుక్తము.

పాపా—(తలవాల్చి కన్నులు మూసికొని యాలోచించుచు) అక్కా! నీ విట్లు బ్రతికివచ్చితివమ్మా! నాప్రాణనాయకుల వాయువులలోఁ గలిపి నిన్ను జూడవచ్చితి ననుకొంటివా? —అమ్మా! నా కేమి యాజ్ఞ? —నీవు కాశీప్రయాణము మాని విజయరామునిం బరిమార్పు మనుచుంటివా? దానం జేసి ప్రయోజనం బేమి! —దుష్ట సంహారము చేసి పగ దీర్చుకొనుటయే ప్రయోజన మనుచుంటివా? సరే! అక్కగారి సెలవులకు బద్ధుడనై యున్నాఁడను (దద్దరిల్లి కన్నులు విప్పి చూచి) రామా! భీమా!

రాము—అయ్యో? యేమి యిట్లు పలవించుచున్నారే?

పాపా—పలవరింతలు గావురా! మల్లమాదేవి నాకంటికి గనబడి యిట్లు చెప్పెనురా.

రాము—అయ్యో! ఆమెచిత్త మామార్గమునపట్ల నెల్లుత్తలం పడుచున్నదో కదా!

పాపా—కాశీప్రయాణము గట్టిపెట్టుదము, కాని విజయరాముని గొట్టుట యెట్లో తెలియకున్నది.

రాము—మనము ముగ్గుర మిపుడు వెళ్లి నిద్రాసమయంబున వాని బట్టికొందము.

పాపా—(ఆలోచించి) రామా! నీమాటవలన నా కశ్వత్థామ జ్ఞాపకము వచ్చుచున్నాఁడురా.

రాము—వారును ముగ్గురే, మనమును ముగ్గురమే కార్యమునట్టిదే.

పాపా—అది దోషములోని దగునా? కాదు.

శా. ద్రోణాచార్యుని పుత్రుఁ డంతటి మహా ♦ త్ముం డర్ధరాత్రంబునన్
ప్రాణంబుల్ గమసొమ్మసిల్లఁ బడి దే ♦ హస్మాకరం జేసె ని
ద్రాణుండైన రిపు న్వధించి పగఁ దీ ♦ ర్పం బోవఁడే నేఁడు నా
క్షోణీశుం డెఱఁబాప్చ రాజుయిరణము ♦ క్తుం డయ్యెదన్ శక్తిమై.

భీము—మేలు మేలు మహారాజ! రే పావిజయరాముఁడు బొబ్బిలి పట్టభద్రుం జేయుచుండని విన వచ్చినది. అది కాకుండ నీతో వాని నీ పట్టంబున యమలోకపట్టభద్రుం జేయ వలయునని నా కోరిక.

పాపా—ఓహో! అట్లయిన నో సప్పుడే ప్రయాణము చేయుదము లెండు.

అందఱు—(లేచి కొంచెము నడచుచున్నారు. తెర లేచును)

పాపా—సేవకులారా! మన మిపుడు బొబ్బిలిసమీపమునకు వచ్చితిమి. విజయరామరాజిపుడు కోటలోనే యున్నాఁడని తెలిసినది. మన మీరూపములతోఁ బోయినఁ గార్యభంగ మగును. కావున విజయనగరమునుండి వచ్చిన దూతలవలెఁ బోయి రాజుభార్య చంద్రయ్యమ్మ పంపినట్లు జాగరూకులమై వానిం జేరవలెను సుండీ.

రాము—దేవర బాగుగా సెలవిచ్చినారు. అట్లుచేయుదము గాక!

అందఱు—(కొంతనడచుచున్నారు; కోటలోఁజేరాయునునిద్రించు విజయరామరాజును గనుపడుచున్నాడు.)

పాపా—సేవకా! అదిగో వాకిలి కావలివాఁడు. నీవు వాఁడు చూడకుండఁ బోయి వానింబట్టి నోరునొక్కుము. రామా! నీవట నుండి తెర చించుకొని లోనికి రమ్ము.

భీము—(దటాలునంజించి కావలివానిం బట్టుకొని నోటగుడ్డ పెట్టి బంధించుచున్నాఁడు.)

పాపా—పులి పులి పులి పులి. బొబ్బిలిపులి బొబ్బిలిపులి (కేకలు వేయును.)

రాము—(కత్తితోఁ జెర విడించుకొని ప్రవేశించి సేవకులఁ బట్టి చాటున జంపి వేయుచున్నాఁడు.)

విజ—(దద్దరిల్లి కనులునలుపుకొనుచు లేచి) ఏదీ! ఏదీ? కొట్టుకొట్టు.

పాపా—పులి పులి పులి బొబ్బిలిపులి. బొబ్బిలిపులి. పులి (కేకలు వేయును.)

విజ—హాహాహాహా! పా-పా-హాహాహాహా? (లేవంబోవును.)

పాపా—నీపాలి కీపాపారాయఁడే పులి (అని కలియఁబడి పట్టుకొని పడవేసి ఱొమ్ముమీఁదఁ గూర్చుండి పీక నొక్కుచున్నాఁడు.)

విజ—(గిజగిజ గించుకొనుచున్నాఁడు.)

పాపా—ఓరోరి పాపాత్ముఁడా! క్రూరుఁడా!

శా. కొండెంబుల్ పదికోట్లుపన్ని బుసికిం ♦ గోపంబు హెచ్చించి నే,
నుండన్ రాక మఱొండుచో మెలఁగుచో ♦ నువ్వెత్తుగావచ్చి నీ
దండుంబుచ్చి సమస్తముం జెఱచితో ♦ దౌర్భాగ్యుఁడా! చిక్కితే
ఖండింతున్ నినుఁదుం డెతుం డెలుగ మె ♦ కృంగాకులుంగుక్కలున్.

చ. తెరచినయిల్లు కుక్క చొఱు ♦ తీరున వీరరసస్వరూప మే
డ్తెఱఁ గనుపించి రావుకుల ♦ ధీరులు వోయిన శూన్యమైన మా
నెఱఁగడి వచ్చిచేరితివె ♦ నీచుఁడ! నీ విటఁ గుల్కుచుందు నం
చఱిమఱి వొందుచుంటి వికఁ ♦ డయ్యెను గంతులుసాగిరావికన్.

మ. నిను నీవారిని బిండింపిండిగను ము ♦ న్నేఁ జిత్రకూటాద్రిపై
గనలం గొట్టిననాఁడు బొబ్బిలి నెటో ♦ కాల్పింతు నం చీవు ని
న్ననుమానింపఁగ చీల్చి ప్రేవు లెదపై ♦ హత్తింతు నం చేను జే
సిన బాసల్ సగబాలు సెల్లెఁ గొఱయున్ ♦ జెల్లున్ని మేమంబునన్.

క. పీనుఁగు పెంటల నుండిన
మా నగరి మ్మేలు మింక ♦ మానవపశువా
మేనం బ్రాణము లుండిన
నే నా జముపీకు నిత్తు ♦ నిదిగో కొనుమా

(అని గుండెలమీఁద గ్రుద్దుచున్నాఁడు)

విజ—(ఓక్కారు మనుచున్నాఁడు)

పాపా—

క. ఓఁక్కారు మనియెద వేలా
కిక్కారు మనకుండ నిన్నుఁ ♦ గిల్కాలునకున్
ముక్కలు ముక్కలు సేయక
తక్కితినే మల్లమాంబ ♦ తమ్ముండ నౌనో.

(రెండు చేతులు నఱకుచున్నాఁడు.)

విజ—రెండుకాళ్ళం బెనగులాడుచున్నాఁడు.

పాపా—ఓరీ! ద్విపాత్పశువా! యేమి గింజుకొనియెదవురా?

(రెండుకాళ్ళు నఱకుచున్నాఁడు,)

విజ—(మొండెమై కనపడుచున్నాఁడు)

పాపా—ఉ. వేంగలరాయునన్న నుడి♦ వేంకటరావునుజంపు యత్నమున్
మంగళసూత్రముం బెఱికి♦ మల్లమదేవిని ద్రోతునంటయున్
ముంగల హైదరుం గలిసి ♦ బుస్సికిఁ జేసినదుష్ట బోధయున్
సంగతియై భవస్మృతికి♦ సాయమొనర్చినటంచు నెంచుమా!

ఇక్కడకు నామనోరథపూర్తియైనది. కాని నీపొట్ట చీల్చి ప్రేవులు ధరించి నీరక్తంబు మేనెల్లం బూసికొంట మిగులుగా నున్నది.

(కత్తినెత్తుచున్నాఁడు. తెరపడును.)

(ముగ్గురు—రక్తసిక్తాంగులై ప్రేవులు ధరించి భీషాకారములతో గనబడుచున్నారు.)

పాపా—(హుంకారము చేయుచు)

మ. ఇపు డత్యుగ్రపరాక్రమక్రమమునన్ ♦ హింసక్రియారంభు నా
నృపశున్ బట్టి వధించితిన్ బవసనన్ ♦ నేఁ బాపరాయుండ నా
త్రిపురధ్వంసకుఁ డైనశూలి యయినన్ ♦ దేజంబు దీపింపఁ జ
ట్టుపలన్ గొట్టినవజ్రి యైన నెదురన్ ♦ జుట్టున్నుగ్గుగం గొట్టఁ జే

సేవకులారా! మనకుఁ బగసూపకారి యైన హైదరుజంగొకఁడు మిగిలియున్నాఁడు. వానిం జంపుట కుపాయాంతరం బెద్దియును లేదు గావున మీరు వాయెత్తి పాపారాయఁడు వచ్చి విజయరామునిం జంపె నని కేకలు వేయుఁడు.

ఇద్దఱు—ఓహో! హైదరుజంగ! పాపారాయఁడు వచ్చి విజయరామునిం జంపినాఁడోహో! (అని కేకలు వేయుచు ధ్వనిచేయుచున్నారు)

[అంతఁ గొంతసేనతో హైదరు ప్రవేశించుచున్నాఁడు]

పాపా.— ఓరోరి ముష్కరతురుష్కాధమా!

స్ర. చీచీ! గోబ్రహ్మహత్యా♦చ్ఛితదురితభర♦చ్ఛిన్నచిత్తప్రవృత్తిన్
నీచత్వోచ్చత్వచింతా♦నియమరహితుఁడై♦నీవుపిన్ గాన కిట్టుల్
నీచాత్మం గూడి తోడం♦దిరుగుశునివలె♦న్మక్కిలంచంపుఁ గూటిన్
ప్రాచీనాచారభాస్వ♦త్ప్రభుసకలకుల♦ధ్వంసముం జేసి తోరీ.

క. నేనే పాపారాయఁడ
నే నెడమై యున్నయపుడు ♦ నీబీరమునున్
భూనాథు నడచినాఁడవు
రా నిన్నున్ మన్నిగొందు ♦ రవరవ దీరన్.

(కత్తిదూసికొని కలియఁబడుచున్నాఁడు. తెర పడుచున్నది.)

పాపా—(సేవకునితోఁ బైటకువచ్చి) రామా! భీమా!

చ. మన మిట వచ్చినట్టిపని ♦ మల్లమదేవి యనుగ్రహంబునన్
గను మెదలించులోపలఁ ♦ గా నొనరించితి మింతయుం గొఱం
తను బడకుండ ధన్యులము ♦ తన్మతి కిష్టముఁ గూర్పఁ గంటిమీ
మనుగడ చాలు స్వర్గపురి ♦ మార్గము పట్టి యికన్ సుఖంతమే.

రాము—రంగరాయామలు లేని భూమిపై బ్రతుకుటకన్న నీచ
కార్య మున్నదా?

భీము—నీచులగు పరాసులువచ్చి పడకిముందే మనమే పొడుచు
కొని రంగారాయనిం గలిసికొందము గాక.

అందఱు—(కత్తులసవరించుకొని పొడుచుకొనుటకుంచుచున్నారు)

పాపా—(కత్తికి నమస్కరించి) ఓహో! శస్త్రరాజమా!

చ. నినుఁ గులధర్మముం దలఁచి ♦ నే నిసుపై చనునంతనుండియున్
గొనియు మహాప్రభావము వ ♦ సుంధగ నీకు నిరర్గళ ప్రవృ
త్తిని గొనఁ జేసి ప్రోచితి గ ♦ దే సకలాంగశాస్త్రగా ప్తి నేఁ
దనువు వొలంగెదం దునిమి ♦ ధర్మపదం బిఁక నాకు శస్త్రమా!

(కత్తి నెత్తుచున్నాఁడు. తెర పడుచున్నది)

[అంత లక్ష్మన్నతో బుస్సీ ప్రవేశించుచున్నాఁడు]

బుస్సీ—లక్ష్మన్నా! పాపారాయఁ డెంతో సేనతో వచ్చి విజయ
రాముని హైదరుం జంపి మనసేనం బాఱఁదోలుచున్నాఁడట! మన
మందుగుండుసామానంతయు నుపయోగింపుడని సేనకాజ్ఞాపించితిని.
మన కేదో యుపద్రవముగా నతఁ డిక్కడకు రాడుగద?

లక్ష్మ—ప్రభువర్యా! పాపారాయనికి సేనలేదు. తనతో నిద్వారం
దెచ్చినాఁడు. తనపగదీర్చుకొని తాఁబొడుచుకొని కాలధర్మమునొంది

నాఁడు. నీ నీడ చూచి నీవు భయపడినట్లు సేన కాజ్ఞాపించితివి. ఎదరిఁ దమ్ముఁలుగక తమలోఁదాము గాల్చుకొని పెక్కుమంది చచ్చినారు. మన నూఱు వేలకు మూఁడు వేలును వారి యైదు వేలకు నిద్దఱు ముగ్గురు మాత్రము నిలిచి యున్నారు.

బుస్సీ—శౌర్యనిధి యగు పాపారాయనిం జూడ నాకు మనము వొడముచున్న దటు నడువుము.

ఇద్దఱు—(నడచుచున్నారు. తెర లేచును. పడియున్న ముగ్గురు కనుపడుచున్నారు)

బుస్సీ—(పాపారాయనిం జూచి) అరేరే! ఏమియీ శౌర్యము! ఏమి యీ పరాక్రమము! ఏమియీ ధైర్యము ఏమి యీ స్థైర్యము! మానధనుం డగు నిమ్మహానుభావుండు చచ్చియును నాకు మిక్కిలి భయంబు పుట్టించుచున్నాఁడు. రక్తసిక్తాంగుఁడై గుడ్లెఱ్ఱజేసి మీసముపై చేయివైచికొని పోఁడున వచ్చుచున్నట్లేయున్నాడు. అహా! మహాశూరుఁడా! యెంత సాహసము చేసితివి? నీ విట్టివాడ వని నే నెఱింగియు హైదరుమాట విని మోసపోతినిగదా! నీవు సజీవుఁడవై యున్న నిన్నీ దేశంబున కధినాథుం జేసి నీ వలన మేలు వడయుచుందును గదా! కట కటా! యెట్టి ఘోరకృత్యము జరిగినది. లక్ష్మణా! నాకీ పాపారాయనిం జూడఁజూడ గుండెపగుల దుఃఖంబు పెచ్చు పెఱుగుచున్నది. నే నిట నిలువ నోపకున్నవాఁడ. పేరోలగంబునకుఁ బోవుదము రమ్ము.

ఇద్దఱు—(నడచుచున్నారు. అపటీక్షేపంబున సభాస్థలమగపడును.)

బుస్సీ—లక్ష్మణా! నీవుపోయి చినవేంకటరాయప్రభృతులం దీసికొని రమ్ము.

లక్ష్మి—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

[అంత దాసీలక్ష్మితోఁ జిన వేంకటరావును, కంచుకియును, లక్ష్మనయు ప్రవేశింతురు]

బుస్సీ—(లేచి కుమారుని నెత్తుకొని సింహాసనముమీఁదఁ గూరు చుండఁ బెట్టుచున్నాఁడు.

అందఱు—(కరతాళధ్వనులు చేయుచున్నారు)

బుస్సీ—(కుమారుంజూచి) బాబూ! నీకు గోత్రపల్లిసీమ మొదలు కొని బొబ్బిలిరాజ్య మంతయు నిచ్చితిని. మీ రెప్పటికి విజయ నగరము వారి చేతిక్రిందనుండనక్కఱ లేదు. మీకు మే మెప్పుడును దోడునీడలై యుండెదము. లక్ష్మీ! నీవీ కుమారుం బెంచి పెద్దవానిం జేయుము? కంచుకీ! నీవు కాలముగడపినవాఁడవు, బుద్ధిమంతుఁడవు. తగినవారిం బెట్టి రాజ్యానుసంధానము చేయుచుండుము. మేముపోయి వచ్చెదము. మఱి నావలన నిక్కుమారునకుం గావలసిన దేదియో చెప్పుము?

కంచుకి—దేవా! నీ యనుగ్రహంబున నిక్కుమారున కన్నియు నున్న యవి, అయిన నిట్టుగాఁ బరమేశ్వరుని బ్రార్థించు చున్న వాఁడ.

(భరతపుత్రునిం గలిసి పాడుచున్నాఁడు)

మంగళమహాశ్రీవృత్తము.

భూతలమునంజనులుపుణ్యమునఁబోవుచును । బోల్పదగురీతినుపకారం

బేతఱిని జేయునటు । నీతులునశించిగుణ। మేగలుగునట్లుగహితంబుల్

నీతులుపొసంగునటు । నేలలవిపండిసని । పిండునటుశత్రుభయమింతే

క్షేతముల నొందనటు। సిద్ధమగుభక్తివిల।సిల్లునటు జేయు పరమేశా,

హిందూస్థానీ కాఫీ—మిశ్రగతి

మంగళమఖలేశా, శుభ— మంగళమఖలేశా
గురుతరదురితవినాశా; శ్రీశా జయ ||మ||
పరమపురుష, విగతకలుష, పావన గుణభాసా
వర భక్తజనాధికపోషా, బహువేషా, సువిశేషా, జయ |మం||

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది షష్ఠాంకము సంపూర్ణము.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.

# జ్యోతిష గ్రంథములు

| | | |
|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | | 0-50 |
| జాతకమార్తాండము | 1 భా | 2-00 |
| డిటో | 2 భా | 2-00 |
| డిటో | 3 భా | 2-00 |
| జ్యోతిష రహస్యము | 1 భా | 2-00 |
| డిటో | 2 భా | 2-00 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | |
| సంజ్ఞాధ్యాయము | 1 భా | 1-00 |
| గణితాధ్యాయము | 2 భా | 1-00 |
| భావఫలాధ్యాయము | 3 భా | 3-00 |
| ద్వాదశభావఫలము | 4 భా | 3-00 |
| జ్యోతిష ఫలప్రదర్శిని | | 0-75 |
| స్వప్నఫలదీపిక | | 0-50 |
| సకలసమస్తగుణ అదృష్టఫలదీపిక | | 1-00 |
| గౌతమసంహిత | | 0-50 |
| వాంఛానాథీయము | | 0-50 |
| కోడిపుంజులశాస్త్రము | | 0-50 |
| అంగసాముద్రికము | | 0-50 |
| జాతకదర్పణము | | 0-75 |
| జాతకపారిజాతము | | 1-00 |
| జాతకరాజీయము | | 1-00 |
| ప్రపంచజ్యోతిషము | | 0-25 |
| జ్యోతిషఫలగ్రంథము | | 0-25 |
| శకునశాస్త్రము | | 0-75 |
| స్త్రీజాతకము | | 0-75 |
| యవనజాతకము | | 0-50 |
| జ్యోతిషార్ణవనవనీతము | | 1-00 |
| దైవజ్ఞకర్ణామృతము | | 2-50 |
| దశాభుక్తి ఫలచంద్రిక అను వృద్ధ పారాశరి | | 1-00 |
| పుట్టుమచ్చలశాస్త్రము | | 0-50 |
| జాతకచంద్రికగోపాలరత్నాకరం | | 0-75 |
| నవగ్రహచింతామణి | | 0-25 |

| | |
|---|---|
| ఋతుశాస్త్రము స్త్రీ అను రజస్వలాజాతకము | 0-75 |
| మూలస్తంభము (శైవగ్రంథము) | 1-00 |
| గర్గసంహిత | 0-25 |
| జయమినిసూత్రములు | 1-00 |
| అనుభవజాతకతరంగిణి | 0-50 |
| పూర్వపారాశరి | 0-50 |
| బృహత్పారాశర సంహిత | 0-25 |
| ఆంధ్రజాతకతత్త్వము సూత్రములు 1, 2 భాగములు | 3-00 |
| గోచారసంహిత | 0-75 |
| కాలామృతము | 1-00 |
| ఆయుర్దాయయోగము | 1-00 |
| ముహూర్తదర్పణము | 1-00 |
| కెట్టమతశాస్త్రము (60 సంవత్సరముల పంటను తెల్పుగ్రంథం) | 1-00 |
| సర్వార్థచింతామణి | 1-00 |
| భృగుసంహిత | 2-50 |
| సంఖ్యాజ్యోతిషసారము | 2-75 |
| మానసిక లకోటా ప్రశ్న చింతామణి | 1-25 |
| అష్టకవర్గు | 0-75 |
| జలార్గళశాస్త్రము | 0-38 |
| ఛప్పన్నము (ప్రశ్నశాస్త్రము) | 0-38 |
| ఆరూఢరత్న సిద్ధాంజనము | 0-75 |
| సూర్యసాముద్రికము | 5-00 |
| సాముద్రికచంద్రిక | 1-25 |
| సమ్మోహనశాస్త్రము అను అదృష్టయోగము | 1-50 |
| సోమనాథరేఖాశాస్త్రము | 0-75 |
| హస్తశాస్త్రము (సాముద్రిక రత్నాకరము రెండు 250 పేజీలు 200 పటములతో) | 3-00 |

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

# ఆంధ్ర నాటకములు

| | | | |
|---|---|---|---|
| చిత్రనళీయము | 1-75 | ప్రసన్న విజయము | 1-00 |
| విషాద సారంగధర | 1-75 | పాదుకాపట్టాభిషేకము | 2-00 |
| పాదుకాపట్టాభిషేకము | 1-50 | విప్రనారాయణ | 1-75 |
| సావిత్రీ చిత్రాశ్వము | 1-50 | రాధాకృష్ణ | 1-50 |
| ముక్తావళి | 1-50 | కోకిల | 1-75 |
| ప్రహ్లాద | 1-50 | వీరమతి | 1-50 |
| రామదాసు | 1-50 | సరస్వతి | 1-50 |
| రామకబీరు | 1-50 | పూర్ణిమ | 1-50 |
| సుభద్రార్జునీయము | 1-50 | చండిక | 1-50 |
| అస్పృశ్యవిజయము (ప్రేమచంద్రయోగి) | 1-50 | శివలీల | 1-50 |
| | | సతీతులసి (జలంధర) | 1-50 |
| భక్త తుకారామ్ | 1-50 | గయోపాఖ్యానము | 1-75 |
| కృష్ణలీల | 1-50 | ప్రసన్న యాదవం(నరకాసురవధ) | 1-50 |
| లవకుశ | 1-50 | పారిజాతాపహరణము | 1-50 |
| భక్త కుచేల | 1-50 | చతురచంద్రహాస | 1-50 |
| మేవాడు శౌర్యాగ్ని | 1-50 | సుందోపసుందులవధ(తిలోత్తమ) | 1-50 |
| విభీషణ పట్టాభిషేకము (లంకాదహనము) | 1-50 | కనకతార | 1-50 |
| | | బలిబంధనము | 1-50 |
| ద్రౌపదీవస్త్రాపహరణము | 1-50 | రాధాకృష్ణ సాంగ్సు | 1-00 |
| రామరావణయుద్ధము | 1-50 | శ్రీకృష్ణతులాభారము సాంగ్సు | 1-00 |
| పాండవ జననము | 1-25 | ద్రౌపదీ వస్త్రాపహరణము | 1-75 |
| పాండవ ప్రవాసము | 1-50 | సక్కుబాయి | 1-50 |
| పాండవ ఉద్యోగము | 1-75 | సావిత్రి | 1-50 |
| పాండవ విజయము | 1-75 | చంద్రగుప్త | 1-50 |
| పాండవ ఉద్యోగము గ్లేజు | 2-00 | దుర్గాదాసు | 2-00 |
| పాండవ విజయము గ్లేజు | 2-00 | రాణాప్రతాపసింహ | 1-50 |
| పాండవ ఉద్యోగ విజయములు గ్లేజు బైండు | 4-00 | పత్నీప్రతాప్ (అనసూయ) | 1-50 |
| | | శ్రీకృష్ణతులాభారము | 1-75 |
| పాండవ అశ్వమేధము | 1-50 | రణతిక్కన | 1-50 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1-25 | కచదేవయాని | 1-50 |
| పండితరాజము | 1-00 | మార్కండేయ (శివలీల) | 1-50 |
| మృచ్ఛకటికము | 2-00 | చింతామణి | 1-75 |
| ముద్రారాక్షసము | 1-50 | వరవిక్రయము | 1-50 |